# ఐదు చాసో కథలు

## - నాటిక రూపాలు

- చాగంటి తులసి



ప్రచురణ :

# AIDU CHASO KATHALU

(Natika Rupalu)

**Anubandham - Ida Nagarikatha!**

(Ekei ki Boley Sabyota - Satirical Play)

by-Michael Madhusudan Dutt

**Chaganti Tulasi**
Cell: 09963377672
email: chagantitulasi@gmail.com


First Edition : November - 2018

Copies :

Publisher's Address :

Price :

Book Alignment & Printed at :

# నాటికల వరుస...

# ఎందుకు పారేస్తాను నాన్నా ?

- నాటిక

వీధి వేపు ఉన్నగది (సావిడి) - ఎదురుగోడకి సాగా కొయ్యకి (కుడిపక్క) పంచెలు - చొక్కాలు వేళ్లాడుతూ ఉంటాయి. చిన్న టేబిలు - కుర్చీ - (పాత కాలానివి) ఎడంపక్క కిటికీ, కిటికీ కింద చిన్నస్టూలు - దానిమీద పద్దులు రాసుకొనే పుస్తకాలు. (కుడిపక్క ద్వారం - ఇంట్లోకి వెళ్లేది - ఎడంపక్క ద్వారం - వీధిలోకి వెళ్లేది) ఉదయపు వేళ 7-8 గంటల సమయం. కిటికీలో నుంచి గదిలోకి ఎండ పడుతూ ఉంటుంది. వీధి వేపు సైకిళ్లు - కూరగాయలు అమ్మేవారి అరుపులు - పిల్లల కేరింతల పరుగులు అప్పుడప్పుడు వినిపిస్తూ ఉంటాయి. తెరలేచేసరికి కుర్చీలో పద్దు పుస్తకం చూస్తూ సిరాబుడ్డీలో కలం తీస్తూ తండ్రి)

తండ్రి : (చికాకుగా కలాన్ని వదిలేసి, పుస్తకాన్ని మూసేసి తలపట్టుకుని "ఊ" అంటూ లేచినిల్చుని చొక్కా జేబుల్ని తిరగేసి బోర్లేసి వెతికి గట్టిగా కేకేస్తాడు) కృష్ణా! ఒరేయికృష్ణా!

తల్లి : (కుడిపక్క నుంచి వస్తూ) ఎందుకలా గావుకేకలు పెడతారు? ఏంకావాలండీ?

తండ్రి : కృష్ణా! ఒరేయి కిష్టిగా!!

తల్లి : ధనియాలతో చేసిన బెల్లం కాఫీ మరోమారు తాగుతారా? తెమ్మన్నారా?

తండ్రి : ఏడీవాడు? పలకడేం? ఒరేయి కిష్టిగా! తెల్లారకుండా పోయాడా ఏం? పక్కింటికి? ఆంధ్రపత్రిక చదవడానికి!

తల్లి : పక్కిల్లూ లేదు - పత్రికా లేదు. బళ్లు తెరిచారు. బళ్లో వేసేరుకారు. వీధిమొహం చూడకుండా మొగుడు చచ్చిన విధవలాగ ఇంట్లో దూరి కూచుంటున్నాడు. వంటింట్లో చెల్లిని ఒళ్లో కూచోపెట్టుకుని కబుర్లు చెప్తున్నాడు.

తండ్రి : బళ్లు తెరిచారు. బళ్లోవేసేరుకారు. బళ్లో వేసేరు కారు అంటూ తెల్లారడం మొదలు ప్రాణాలు తోడేస్తూ ఒకటే పోరు! ఈ ఏడాది వాడికి చదువు చెప్పించనని చెప్పానా లేదా? ఎన్నిసార్లు చెప్పడం?

తల్లి : ఎక్కడన్నా చదువు మాన్పించుతారండీ? రుణమో పణమో చేసి ముక్క చెప్పించకపోతే కుర్రాడెందుకేనా పనికొస్తాడా? చదువుకునే ఈడులో బడిమానిపించి ఇంట్లో కూచోబెడితే తరవాత గాడిదలని కాయడానికేనా పనికిరాకుండా పోతాడు. ఏదో చూసి బడిలో వెయ్యండి.

తండ్రి : తెలిసన్నా ఉండాలి. చెబితే విననైనా వినాలి. ఎన్ని వందలసార్లు చెప్పను? బళ్లో వెయ్యగానే సంబరమా? వాడు చదివేది ఫోర్తుఫారమ్. జీతమెక్కువ. ఎంతకట్టాలో తెలుసా? తూగ్గలనా? ప్రవేశపెట్టడానికి, పుస్తకాలకే అవుతుంది

ఏభైరూపాయలు. దస్తాకాగితాలు రూపాయి! అర్ధణా పెనసలు ఆరణాలు! ఎక్కణ్ణుంచి తేవడం? మొహాన్ని వాడికి లేందే! వాడి ప్రారబ్దం. మన ప్రారబ్దం. నీకళ్లని నువ్వు చూస్తున్నావ్. వారం వారం ఎక్కడలేని డబ్బూ బియ్యానికి ముడుపు చెల్లించడానికే తల ప్రాణం తోక్కొస్తున్నాది. మాటలా??

తల్లి : నేను బడబడలాడ్డమే తప్ప నామాట వినిపించుకోరు కద. ఎప్పుడూ ఏకరువు పెట్టిందే ఏకరువు పెడతారు. తలతాకట్టు పెట్టయినా వాణ్ణి బళ్లో వెయ్యండి. వాడేమన్నా అందరి కుర్రాళ్లలా అది కావాలి ఇది కావాలి అని అడుగుతున్నాడా? పేచీపెడుతున్నాడా? పేంట్లు కుట్టించమని ఏడ్చాడా?

తండ్రి : అవునవును? మన తాహతుకి కుట్టించనూ మరి డబుల్ కప్పు చొక్కాలూ హవానా పేంట్లునూ! కొననా మరి బూట్లూ జోళ్లూ మేజోళ్లూ!!

తల్లి : అదేమరి మీతో ఉన్నదే అది! నేచెప్తున్నదేమిటి? మీరు అనేదేమిటి? వాడికీ మంచీచెడ్డా తెలుసునండీ!

తండ్రి : అవునవును, మంచీ చెడ్డా నీకూ తెల్సును. వాడికీ తెల్సు. తెలియంది నాకే!

తల్లి : పేంటుకైతే బట్ట ఎక్కువవుతుందీ, బట్ట ఎక్కువైతే డబ్బు ఎక్కువ వుతుంది. నిక్కరూ చొక్కాలే కుట్టించమని నాన్నకి చెప్పమ్మా అని ఏడ్చేడు.

తండ్రి : ఏడిచేడే! ఏడ్చేడు! నువ్వూ నా బుర్ర తిన్నావ్!

తల్లి : ఏడ్చేడంటే ఏడ్వడా? ఉన్నవే పేరుకి రెండు జతలు. రేవుకో జత!

తండ్రి : వస్తాయి వస్తాయి రేవుకి పది జతలు నీకూ నీ కొడుక్కీ!!

తల్లి : నిక్కరుకి పోస్టాఫీసు ఉందని పిల్లలు వెక్కిరిస్తున్నారమ్మా అని నాదగ్గర ఏడ్చేడు కాని మీ ఎదటపడి ఎప్పుడన్నా అడిగాడా? చొక్కా సరేసరి! భుజం చిరిగి జారిపోయింది. ఏదో నాకొచ్చినట్టు ఎలాగో ఎత్తి కుట్టానా అది బుట్టలా పైకి లేచి నిల్చుంది. పాపం ఆ గుడ్డలే ఏడాదంతా వేసుకు వెళ్లాడు.

తండ్రి : వేసుకుంటాడే! వేసుకోక ఏం చేస్తాడు? పెట్టిపుట్టందే! వెళ్లాడే వెళ్లాడే! వెళ్లాడు! వెళ్లకేం చేస్తాడు? పెట్టిపుట్టందే!

తల్లి : పిచ్చిసన్నాసి! అలా అయినా బాగా పాసయ్యేడు. మీరే చెప్పేరు కదండీ ఒక్క ఇంగ్లీషులో తప్ప అన్నింటిలోనూ వాడికి ఫస్టు మార్కులే వచ్చాయని!

తండ్రి : సోది! సోది! ఒకటే సోది! వాణ్ణి కేకేస్తే నువ్వెందుకు వచ్చావ్?

తల్లి : ఏంకావాలో నాతో చెప్పొచ్చుగా!

తండ్రి : పిలవ్వే వాణ్ణి! ఏఝామై గొంతుచించుకు పిలుస్తున్నా పలకడేం! చెవిటివాడిలా! చుట్టలైపోయాయి. అప్పుడే ఎనిమిదైపోతోంది. పద్దులు చూడ్డం అవలేదు. ఒరేయి కిష్టిగా! కృష్ణా!

తల్లి : చుట్టలు! చుట్టలు! కట్టలు కట్టలు చుట్టలు! భోజనానికి ముందు చుట్ట. భోజనం తర్వాత చుట్ట! ఇరవైనాలుగ్గంటలూ నోట్లోచుట్ట ఉండాల్సిందే! చుట్టకి చుట్ట ముట్టించాల్సిందే! కృష్ణా! ఒరే బాబూ, మీ నాన్న పిలుస్తున్నార్రా (లోపలికి వెళ్తుంది.)

కృష్ణుడు : (లోపల్నించి వస్తాడు. చింకినిక్కరు, బుట్టలా చెయ్యి లేచిపోయిన చొక్కా. మొహం వాడిపోయి ఉంటుంది)

తండ్రి : ఏ ఝామైై అరిచి ఛస్తున్నా! చెవుల్లో సీసం పోసుకున్నావా? ఇంద ఈ డబ్బులు తీసుకెళ్లు. చుట్టలు పట్రా! పరుగున వెళ్లి పరుగున ఇక్కడున్నట్టురా! తెలిసిందా!

కృష్ణుడు : (తలవంచుకుని డబ్బులు తీసుకుంటాడు మెల్లిగా వెళ్లబోతూ ఉంటాడు)

తండ్రి : చెప్తున్నానా? నత్తనడక కాదు. పరిగెట్టు. దగ్గరే కదా అని అప్పన్న కొట్టులో తెచ్చేవు! వాడి దగ్గర పొగాకు ఘాటు ఉండదు. ఉమ్మి రామన్న కొట్టులోనే తే! వినిపిస్తోందా!

(కృష్ణుడు పరిగెడ్తాడు)

(దీపాలు ఆరిపోతాయి)

## దృశ్యపరివర్తనం

(దీపాలు వెలుగుతాయి)

(ఎడంపక్క నుండి - రోడ్డు కొంతమేర - ఆతర్వాత బడి భవనం - తర్వాత మళ్లీ రోడ్డు. అంటే బడి స్టేజికి మధ్యలో ఉండాలి. బడి వరండాలు స్థంభాలు కనపడాలి-)

కృష్ణుడు ఇంట్లోంచి పరిగెట్టేడే కాని రోడ్డు మీదకొచ్చేసరికి ఆగిపోతాడు. వాడిలో వాడు గొణుక్కుంటూ నిలబడిపోతాడు. గొణుక్కుంటూనే నెమ్మదిగా నడుస్తాడు)

కృష్ణుడు : (వాడిలో వాడు - గొణుగుడుగా) నాన్న మరీను! తనే వెళ్లి తెచ్చుకోవచ్చుగా చుట్టలు! నాకు పురమాయించాడు! సాయంత్రం తెచ్చుకున్న కట్టంతా కాల్చేశాడు కాబోలు! ఉమ్మి రామన్న కొట్లోనే తెమ్మన్నాడు - బడి పక్క నుంచే వెళ్లాలి. బడి పక్క నుంచే తిరిగి రావాలి.

(బడిగోల సముద్రపు ఘోషలా వినపడాలి. బడి వరండాలు - గదులు - అమ్మాయిలతో అబ్బాయిలతో నిండిపోయి అటూ ఇటూ పరుగులు పెడ్తూ కనపడుతూ ఉండాలి) మొదటి గంట కొట్టేసారులా ఉంది. బుర్రొంచుకుని ఎవరి కంటా పడకుండా పరిగెడ్తా!

(బడి దగ్గర పడుతూనే రోడ్డుకి అటువేపు ఓవారగా బుర్రొంచుకొని పరిగెడ్తాడు) కృష్ణా! కృష్ణా! అంటూ బడివరండా లోంచి కేక వినపడుతుంది. కృష్ణుడు వెనక్కి తిరిగి చూశాడు. నరిసింహం పరిగెట్టుకొచ్చి వాడి భుజంమీద

చెయ్యేసేడు. నరిసింహం డబుల్‌కప్స్ చొక్కా హనావా పేంటూ జోళ్లూ తొడుక్కుని నీటుగా ఉంటాడు. వాడి చంకలో కొత్త పుస్తకం ఒకటి ఉంటుంది)

నరిసింహం : ఏంరా! నువ్వు బళ్లోకి రావడంలేదు!

కృష్ణుడు : సోమవారం చేరతాను.

నరిసింహం : పుస్తకాలు కొన్నావా?

కృష్ణుడు : ఇంకా లేదు.

నరిసింహం : వేగిరం కొనుక్కో మళ్లా అయిపోతాయి. ఎక్సర్‌సైజు పుస్తకాలు షాపుల్లో కొనకేం. స్టోర్సులో చవగ్గా వున్నాయి. ధరలన్నీ దారుణంగా పెరిగి పోయాయిరా!

(కృష్ణుడు నరసింహం చంకలో పుస్తకాన్ని చూస్తాడు)

కృష్ణుడు : ఏం పుస్తకంరా అదీ!

నరిసింహం : ఇంగ్లీషు పుస్తకం. నేనన్ని పుస్తకాలు కొనేశాను. జాగ్రఫీ పుస్తకమే కొనలేదు. జాగ్రఫీ పుస్తకాలు ఇంకా స్టోర్సు వాళ్లకి రాలేదు. ఇంద చూడు పుస్తకం.

(కృష్ణుడు పుస్తకం తీసుకుని పేజీలు తిరిగేసేడు. కొత్త పుస్తకం పరిమళం పైకివచ్చింది. పుస్తకంలోకి మొహం పెట్టి వాసన చూస్తాడు.)

నరిసింహం : కొత్త పుస్తకం వాసన బాగుంటుంది కదరా!

కృష్ణుడు : కమ్మగా వుంటుంది. నాకెంతో యిష్టం.

నరిసింహం : నీకింగ్లీషులో ఫస్టుమార్కు రాలేదు కదరా!

కృష్ణుడు : నాలుగు మార్కుల్లో పోయింది.

నరిసింహం : ఎవరికొచ్చిందిరా?

కృష్ణుడు : శకుంతల కొట్టేసింది.

నరిసింహం : నిజమే! నేనమ్మలేదు. దానికెన్నొచ్చాయి?

కృష్ణుడు : నాకరవైనాలుగు. దానికరవై ఎనిమిది.

నరిసింహం : ఆడ పిల్లని మేష్టరు వేసేసుంటాడు.

కృష్ణుడు : నీమొహం! అది తెలివైంది!

నరిసింహం : తస్సా చెక్కా! ఆడ పిల్లలు చదవివేస్తున్నారురా!

(కృష్ణుడు మొహంలోకి వెలుగూ, కళాకాంతీ వస్తాయి. గొప్పగా అనిపించి నట్టు ముఖ కవళికలు మారతాయి. అంతలోనే ఆవెలుగు ఆరిపోయి మళ్లీ మొహం చిన్నపోతుంది. బాధ మొహంలో కొట్టొచ్చినట్టు కనపడు తుంది. కొత్త ఇంగ్లీషు పుస్తకం పేజీలు తిరిగేసిన కొద్దీ వాడి మొహంలో మార్పు స్పష్టంగా కనపడుతుంది. బాధతో మొహంలో నరాలు/నుదుటి మీద/ ఉబుకుతాయి. కళ్లలో నీళ్లు రాబోయి ఆగిపోతాయి)

నరసింహం : కృష్ణా! వేగం చేరరా, డివిజన్లు పెట్టేశారు. నేను 'జె' డివిజనల్లో పడ్డాను. మన బేచివాళ్లంతా 'జె' డివిజన్లోనే పడ్డారు!

కృష్ణుడు : అమ్మబాబో! "జె" డివిజను వరకూ పిల్లలున్నారా?

నరిసింహం : "జె"తో ఆగిపోలేదు. "కే" డివిజను కూడా వుంది.

కృష్ణుడు : (ఎ, బి, సి, డి అని వేళ్లమీద లెక్కపెడుతూ) పదకొండు డివిజన్లే!

నరిసింహం : అంటే మన ఫోర్తు ఫారంలో మనం మొత్తం ఐదు వందల మంది వరకూ ఉంటాంరా! ఒక్కొక్క డివిజన్లో
నలభైకాదు, కొన్నిటిలో నలభై ఐదుమందిని కూడా వేసేస్తున్నారు.

కృష్ణుడు : (మరి అక్కడ నిల్చోలేకపోతాడు. వాడి మొహం నిండా బాధ కనిపిస్తూ మళ్లీ సద్దుకుంటూ ఉంటుంది.) నేచుట్టలకెళ్లాలి. పోతా. (ఇంగ్లీషు పుస్తకం ఇచ్చేస్తాడు)

నరిసింహం : ఒరేయి, ఈ బొమ్మ చూశావ్రా?

(నరిసింహం ఇంగ్లీషు పుస్తకంలో పాఠాలకి ముందున్న త్రివర్ణచిత్రం చూపిస్తాడు)

కృష్ణుడు : (బొమ్మవేపు చూస్తూ కళ్లుపెద్దవి చేస్తాడు) జొన్నచేలు కోస్తున్నార్రా రైతులు!

నరిసింహం : చూశావా ఈ పిట్టగూడు! జొన్నరేకులతో కట్టుకున్నది. పిట్ట గుడ్లు జారి పోతున్నాయి. గూడు కింద పడిపోతోంది.

కృష్ణుడు : పాపం ఆ పిట్టలు చూడు రెండు ముక్కులూ విప్పి చేనుమీద ఎగురు తున్నాయి!

నరిసింహం : కోతల వాళ్లు తలలెత్తి పిట్టలు చూస్తున్నార్రా!

కృష్ణుడు : మూడు రంగులతో వేశాడు చిత్రకారుడు! ముచ్చటగా ఉంది.

(మొదటిబెల్లు ఖంగుమంటూ వినబడ్డాది. దూరంగా ఉన్న పిల్లలు వరండాల మీంచి, రోడ్డు మీంచి బడిగదుల్లోకి పరుగు పెడుతున్నారు. ఉపాధ్యాయులు రిజిష్టర్లు పట్టుకుని అటు ఇటూ వెళ్తూ కనబడుతున్నారు

(పదకొండేళ్ల శకుంతల పుస్తకాల్ని గుండెల మీద హత్తుకుని వచ్చింది. సూదిముక్కు, సూదిగెడ్డాం, దాని కళ్లు తెలివి తేటల తళుకులతో మెరుస్తూ ఉంటాయి. శకుంతల కృష్ణుణ్ణి, నరిసింహాన్ని చూసి వాళ్లదగ్గరికి వస్తుంది)

శకుంతల : (వస్తూనే) కృష్ణా! ఇంగ్లీషులో ఫస్టుమార్కునాది!

కృష్ణుడు : ఒక్క ఇంగ్లీష లోనే కదా! నాకు మూడింట్లో ఫస్టు మార్కులొచ్చాయి. లెక్కల్లో నూటికి నూరు!

శకుంతల : ఇంగ్లీషు ముఖ్యమైనదండీ!

కృష్ణుడు : లెక్కలంతకన్నానండి! ఆ మాటకొస్తే తెనుగు ముఖ్యమండి. తెనుగులో ఫస్టుమార్కు ఎవరిదండి?!

శకుంతల : ఇంగ్లీషే ముఖ్యమండి. ఎవరినడుగుతావో అడుగు.

కృష్ణుడు : తెనుగేనండి! బియ్యేవాళ్లక్కూడా ఇంగ్లీషులో మానేసి లెక్కలూ అవీ తెనుగులోనే చెప్పాలని పేపర్లో పడ్డాదండి.

శకుంతల : నువ్వు మహాపేపరు చదివిఏడిశావు!

కృష్ణుడు : నేనాంధ్రపత్రిక రోజూ చదువుతాను. మాయింటి దగ్గర వాళ్లకొస్తుంది. (రెండో బెల్లు ఖంగుఖంగుమని మొదలయింది. శకుంతలా, కృష్ణుడూ ఒకరినొకరు మార్కులూ చదువుతో ఉడికించుకుంటూవుంటే నరిసింహం మాట్లాడకుండా నిల్చుని ఉంటాడు. చదువులో తెయ్యమ్మ కావడంతో రెండోబెల్లు కాగానే చల్లగా బళ్లోకి చెప్పాపెట్టకుండా జారిపోయాడు.)

శకుంతల : రెండో బెల్లు అయింది. బళ్లోకి రా!

కృష్ణుడు : నేను సోమవారం నుంచి వస్తాను.

శకుంతల : ఫోర్తుఫారంలో నీ పని చెప్తాను. ఒక్క ఫస్టుమార్కురానివ్వను.

కృష్ణుడు : ఇహనన్ని ఫస్టుమార్కులూ నీవేలే!

శకుంతల : ఏం?

కృష్ణుడు : ఏమీ లేదు.

శకుంతల : నువ్వు మాయింటికి రావడం మానేశావేంరా? మా అమ్మా నాన్నా కృష్ణుడు రాలేదేమా అని రోజూ అంటారు.

కృష్ణుడు : ఏమీ లేదు.

శకుంతల : నేను బళ్లోకి పోవాలి బాబూ! (పరిగెట్టింది)

కృష్ణుడు : శకుంతలా!

శకుంతల : (పిలుపు విని, వెనక్కి చూసి) ఏం?

కృష్ణుడు : ఏమీలేదు. (శకుంతల వెళ్లిపోతూ ఉంటుంది.)

కృష్ణుడు : శకుంతలా! అని పిలవబోతాడు. చెయ్యెత్తుతాడు. తనని తాను తమాయించుకుని ఆగిపోతాడు. పరిగెడుతూ, వెళ్లిపోతూవుంటే శకుంతలని చూస్తూ నిల్చుంటాడు శకుంతల వరండా మీంచి గదులవేపుకి వెళ్లిపోయి మరిక కనబడదు.

రోడ్డుమీద నిలబడ్డ కృష్ణుడు నిలబడ్డవాడు నిలబడ్డట్టూ ఉండిపోతాడు. బడిపిల్లల గోల తగ్గిపోతుంది. వరండాలన్నీ ఖాళీ అయిపోతాయి. మేష్టర్ల మాటలు ఉండుండి వినబడుతూ ఉంటాయి. కృష్ణుడి కాళ్లు బడి దగ్గర్నుంచి ముందుకు పడలేదు. బడివరండాలోకి వాడికి తెలీకుండానే (Trance లో ఉన్నట్టు) వాడు వెళ్తాడు. వరండా స్థంభం వేపు చూస్తాడు. స్థంభం మీద ఆకతాయి కుర్రవెధవల కొక్కిరిబిక్కిరి రాతలు కనబడతాయి.

కృష్ణుడు : (పైకి గట్టిగా అంటాడు) అరే ఇది శకుంతల చేతిరాతలా ఉందే! (స్థంభానికి బాగా దగ్గరగా వెళ్లి స్థంభం మీద మొహం పెట్టి మరీ చూస్తాడు) రాత కొక్కిరి బిక్కిరిగానే ఉంది. నేనే కనక రాసిఉంటే ముత్యాల కోవలా ఉండి ఉండేది! శకుంతల దస్తూరీ మంచిదికాదు. మేష్టర్లు దాన్ని ఎప్పుడూ దెబ్బలాడుతూ ఉంటారు. ఉహూ ఇది కొక్కిరి బిక్కిరిగానే ఉంది. అయినా శకుంతల రాసి ఉండదు. ఇలాంటి ఆకతాయి పనులు అది చెయ్యదు. ఏ గుంట వెధవ రాసేడో! (తనలో తాను మాట్లాడుకుంటూ స్థంభానికి ఆనుకుని నిల్చుంటాడు. ఉబికి ఉబికి వస్తున్న దు:ఖాన్ని అదుపులో ఉంచుకోవడానికి కష్టపడుతూ ఉంటాడు) నేనిక్కడే ఉండిపోతాను. నేనింటికి వెళ్లను. ఇక్కణ్ణించి కదలను. వెళ్లనుకాక వెళ్లను. కదలను కాక కదలను. (కళ్లు మూసుకుంటాడు.)

దృశ్యాల ప్రారంభం : (తెరమీద వాడి జ్ఞాపకాలకనుగుణంగా బొమ్మలు వస్తూ పోతూ ఉండాలి.) (ఛాయాచిత్రాలు)

దృశ్యం-1 : నాలుగో క్లాసు. అవును నాలుగోక్లాసే. అందరూ నన్ను మెచ్చుకోవడమే. ఐదోక్లాసు - ఐదోక్లాసే! ఆ గోపిగాడు
వెధవ నాకు మంచి మార్కులు వచ్చేయని ఓర్వలేకపోయాడు. చాడీలు చెప్పాడు. అయితే ఏమైంది? అబద్దాలు
చెప్తావురా వెధవా అని మేష్టరు గోపీగాణ్ణే చితకతన్నేడు.

దృశ్యం-1 : (ఇక్కడ తెరమీద ఛాయాచిత్రంగా క్లాసురూమూ - చాడీలు చెప్తున్న కుర్రాడు - బుర్రొంచుకు నిల్చున్న కృష్ణుడూ, ఆకుర్రాణ్ణి కొడుతున్న మేష్టరు దృశ్యం కనపడాలి.)

కృష్ణుడు : తెనుగులో ఎప్పుడూ ఫస్టుమార్కు తనదే. తెనుగుమాస్టారు పాఠాలు ఎంత బాగానో చెప్తారు. ఒక్కసారి వింటే చాలు గుర్తుండిపోతాయి. ఆవేళ మాస్టారు గాంధారపతి అంటే ఎవరు అని అడిగారు. ఎవరూ చెప్పలేక పోయారు. నేలకేసి ఇంటికప్పుకేసి చూసి గాంధారపతా? గాంధారపతా! అటూ ధృతరాష్ట్రుడు అన్నారు. నేను నిల్చుని గాంధారదేశపు రాజు అనగానే మాస్టారు సెబాస్ అంటూ నా దగ్గరకొచ్చి మరీ భుజంతట్టి మెచ్చుకున్నారు.

దృశ్యం-2 : (పెద్దక్లాసు - థర్డ్‌ఫారమ్ రూమ్ నెం-3 అని బోర్డు మీద రాసి ఉండాలి. పిల్లలూ మేష్టరూ - పిల్లలు నేలకేసి ఇంటికప్పుకేసి చూడ్డం - 'ధృతరాష్ట్రుడు' అని గట్టిగా అండం - కృష్ణుడు లేచి నిల్చొని 'గాంధారదేశపు రాజు' అని చెప్పడం - సెబాస్ అని గట్టిగా మేష్టరు అని వాడి బెంచి దగ్గరకొచ్చి భుజం

తట్టడం - ఇది ఛాయాచిత్రంగా, సంభాషణ వినబడేటట్టు చూపెట్టాలి.)

కృష్ణుడు : (బెక్కులు బెక్కుతూ) డిస్ కంటిన్యూడ్! డిస్ కంటిన్యూడ్! డిస్ కంటిన్యూడ్! (గట్టిగానే అంటాడు.)

దృశ్యం-3 : (క్లాసురూం. మేష్టరు ఎటెండెన్సు పిలుస్తూ పిలుస్తూ అప్పారావ్! అప్పారావ్! అప్పారావ్! వీడు ఇవాళా రాలేదు. "అవునండీ. వాడు క్లాసుకి రావటమే లేదండి'' వీడు ఇక రాడు. చదువుమానీసేడు. బళ్లోకింక రాడు. పేరు కొట్టేస్తాను. డిస్‌కంటిన్యూడ్ అని రాసేస్తా. కృష్ణుడు - డిస్‌కంటిన్యూడ్ అంటే ఏమిటండీ? మాష్టరు - ఏదన్నా పనిని కొనసాగించకుండా మధ్యలోనే ఆపీడం.

కృష్ణుడు : (ఊహల్లో వినిపిస్తూ ఉంటుంది)

(మేష్టరు ఎటెండెన్సు పిలుస్తూ ఉంటాడు. కృష్ణా! కృష్ణా! కృష్ణా! కృష్ణుడు బళ్లోకి రాటంలేదండీ! ఇకరాడు. వాడిపేరు కొట్టేస్తాను.

(డిస్‌కంటిన్యూడ్. డిస్ కంటిన్యూడ్, డిస్‌కంటిన్యూడ్ గట్టిగా వినబడుతూ ఉండాలి)

కృష్ణుడు : ఏడుపు గట్టిగా వినపడేటట్టు - వెక్కివెక్కి ఏడుపు. డిస్‌కంటిన్యూడ్ అంటూ ఏడుస్తూ ఉంటాడు.

(వెనక నుండి డిస్‌కంటిన్యూడ్, డిస్‌కంటిన్యూడ్ అని వినపడుతూ ఉండాలి)

"ఉహూ నేనింటికి వెళ్లను. వెళ్లమన్నా వెళ్లను. కదలను. ఇక్కడే ఉండి పోతాను. (ఏడుస్తూనే) భోజననికీ వెళ్లను. భోజనానికీ వెళ్లను.

(మొహం ఎర్రగా కందగడ్డలా అవుతుంది. ఏడుపుతో ముక్కు నీటితో బరువెక్కిపోతుంది. ఎగబీల్చుకుంటూ ఏడుపుని ఆపుకోలేక స్థంభానికి చేరబడి కూచుండిపోతాడు)

లైట్స్ ఆఫ్ అయి వెలుగుతాయి.

(మొదటి పిరీయడ్ అయిపోయిన బెల్లు. కృష్ణుడు అలాగే కదలకుండా ఏడుస్తూ, ఏడ్పు దిగమింగుకుంటూ కూచుని ఉంటాడు)

రోడ్డు - ఎడంవేపునుండి - చివరలో తండ్రి వస్తూ కనబడాలి. గబగబా నడుస్తూ పెద్ద పెద్ద అంగలతో బడి దగ్గరకు వచ్చే సమయానికి మొదటి పిరీయడ్ బెల్లు ఖంగుమంటూ వినబడాలి. ఆ బెల్లు చప్పుడికి తండ్రి బడివేపు చూడాలి. వరండాలో కూచున్న కృష్ణుడు అతనికి కనబడాలి. అతడు పెద్దపెద్ద అంగలతో చికాకుపడ్తున్న మొహంతో-కోపంతో-వాడి దగ్గరికి వెళ్లాలి.)

తండ్రి : ఓరివెధవా! చుట్టలు తెమ్మంటే ఇక్కడ దిగమారేవేం?

కృష్ణుడు : చూడు (తండ్రిని చూసి లేవడు. తండ్రి గదమాయింపుతో తలెత్తి చూస్తాడు.)

తండ్రి : ఏమిట్రా చూడ్డం?

కృష్ణుడు : పాపం కనబడదు.

తండ్రి : ఏమిటిరా నీ శ్రాద్ధం!

కృష్ణుడు : నా శ్రాద్ధమే

తండ్రి : ఏమిటిరా?

కృష్ణుడు : వాళ్లంతా బడికెళ్లారు.

(తండ్రి నిర్ఘాంతపోతాడు. కొడుకుని తేరిపార చూస్తాడు. వాడి ఏడుపు మొహాన్ని అప్పుడే చూసినట్టు చూస్తాడు.)

తండ్రి : వెర్రినాగమ్మా! అదిరా!

(కృష్ణుడు దు:ఖం పొంగుకొని వస్తుంది. వెక్కివెక్కి చుట్టుకుపోతూ ఏడుపు. తండ్రి కొడుకువేపు చూస్తూ నిలుచుండిపోయాడు. అతని మొహంలో క్రమంగా మార్పు. కొడుకు బాధ క్రమంగా అతని మొహంలో విచారంగా బాధగా ఆవరించుకుంటుంది. కొడుకుపక్క కింద కూచుండిపోయి కొడుకుని ఒళ్లోకి దగ్గరగా తీసుకుంటాడు)

తండ్రి : చదువు మానిపించానని ఇంత బాధ పడుతున్నావా? బడి వరండాలు పట్టుకొని దేవుల్లాడుతున్నావా? నాయనా! నాతండ్రీ! పదఇంటికి పోదాం. లే!

కృష్ణుడు : నే(్రనాను! (భూమి బద్దలైనంత గట్టిగా అరిచాడు)

తండ్రి : ఏంచేస్తావురా?

కృష్ణుడు : ఈ స్థంభానికి బుర్ర బద్దలు కొట్టుకుంటాను.

(బుర్రెత్తి స్థంభంవేపు బుర్ర తాటించబోతాడు)

(అంతపనీ చేసేస్తాడని హడిలిపోతూ తండ్రి వాణ్ణి గట్టిగా కాగలించు కుంటాడు.)

తండ్రి : లే బాబూ! నా బాబువి కాదూ! పద నాయనా ఇంటికి పోదాం పద! లే!

కృష్ణుడు : బడినాదీ! (తండ్రి కౌగిలి విడిపించుకుంటూ గట్టిగా అరిచాడు)

తండ్రి : నీదేనురా బాబూ! బడి నీదేనురా!

కృష్ణుడు : బడిలోకి తీసుకెళ్లు మరి.

తండ్రి : లే - మరి లేచి నుంచో.

(కృష్ణుడు : తండ్రి చెయ్యిపట్టుకుని ఓ చేత్తో కళ్లు మొహం తుడుచుకుంటూ - తండ్రీ కొడుకులు లేచి నిల్చుంటారు)

తండ్రి : తలతాకట్టు పెట్టుకునేనా బళ్లో వేస్తాను. ముందు ఇంటికి పద.

కృష్ణుడు : ఇప్పుడే వెయ్యి. ఇప్పుడే వెయ్యి.

తండ్రి : డబ్బు చూసి వేస్తాను.

కృష్ణుడు : ఇంటికి వెళ్లి లేదంటావు. నాకు తెల్సు ఇంటికి వెళ్లి లేదంటావు.

తండ్రి : అన్నురా! అన్ను!

కృష్ణుడు : ఐతే పుస్తకాలు ముందుకొను.

తండ్రి : వెర్రినాయినా! వాటికి మాత్రం డబ్బొద్దూ?

కృష్ణుడు : ఒక్క పుస్తకం కొను.

తండ్రి : ఏ పుస్తకం కొనమన్నావు?

కృష్ణుడు : ఇంగ్లీషు పుస్తకం కొను.

తండ్రి : సరే - కొందాం. పద. ఏడవకు నాయినా ఏడవకు. నే చచ్చిపోయాను. ఏడవకు (ఎడంవేపుకి అడుగు వేస్తాడు)

కృష్ణుడు : బడి స్టోర్సు ఇటూ! అటు కాదు. అంటే కొనవా?

తండ్రి : లేదురా! ఇటే ఇటే పద!

(కృష్ణుడు తండ్రి చేతిని చంకలో పెట్టుకుని చేతి మండతో కళ్లు తుడుచు కుంటూ, ముక్కు ఎగబీలుస్తూ కుడివేపుకి తండ్రిని లాగుతూ - తండ్రీ కొడుకూ నడుస్తూ)

తండ్రి : (దృశ్యంగా తెరమీద నీడతో చూపెట్టాలి.) (ఊహల్ని వెనక నుండి మాటలు వినిపిస్తున్నట్టుగా ఉండాలి.)

దృశ్యం-4 : తూగలేకకాని చదువు చెప్పించాలని నాకు మాత్రం లేదూ? చేతులూ కాళ్లూ ఆడక మానిపించేద్దామనుకున్నా. పాపం అది కొడుకుని బళ్లో వెయ్యమని రోజూ పోరుతూనే ఉంది. వెర్రి నాగమ్మ దాని దగ్గర ఇరవైనాలుగ్గంటలూ ఏడుస్తున్నాడు కాబోలు! ఏం చెయ్యను! చుట్టలు మానేస్తాను. చుట్టలు మానేస్తే వీడి బడి జీతానికి వస్తుంది! అవునూ! అన్నట్టు వీడు చుట్టల కొట్టు వరకూ వెళ్లేదు.

(అలా అన్నవెంటనే తెరమీద దృశ్యం అరిపోతుంది.)

తండ్రి : (హఠాత్తుగా) ఇందాకా చుట్టలకిచ్చిన డబ్బులున్నాయా? పారేశావా?

కృష్ణుడు : ప.. ప్ప.. ప్పారీలేదు. జేబులో ఉన్నాయి. ఎందుకు పారేస్తాను నాన్నా!

(జేబులోంచి డబ్బులు తీస్తూ ఉండగా లైట్స్ ఆఫ్.)

తెరపడుతుంది.

కథప్రచురణ : 1944-మే-భారతి

..........................................................................................

# జంక్షన్‌లో బడ్డీ

శ్రవ్యనాటిక

(గూడెం. గూడెం అని తెలియడానికి పిల్లల, తల్లుల అరుపులు మగవాళ్ల మాటలు కలగాపులగలగా వినిపిస్తూ ఉండాలి. వాటిమధ్య నుండీ రామయ్యగొంతు దూరం నుండి వినిపిస్తూ దగ్గరకి గట్టిగా ఏడుపుతో వస్తుంది)

రామయ్య : నాకీ ఆపద ఎందుకు తెచ్చిపెట్టావు తల్లీ! ఎల్లమ్మ తల్లీ! ఏనాడు నీ మొక్కు చెల్లించలేదు తల్లీ! ఎల్లమ్మతల్లీ! (గోలు గోలుమని ఏడుస్తూ ఉంటాడు) ఏమిటి సాధనం ఎల్లమ్మతల్లీ! ఏటిసెయ్యాలి తల్లీ!
(గట్టిగా పొలికేకతో ఏడుస్తాడు)

పోలిగాడు : (దూరం నుండి గొంతు వినపడుతూ దగ్గరగా వస్తుంది) ఏటా ఏడుపు? ఎవుడాడు? రామయ్య గొంతునాగుంది! గగ్గోలు పెట్టేస్తూ ఏడుస్తునాడేటి! ఏటైనాది సెప్మా! (దగ్గరగా) ఏటిరా రామయ్యా ఏటైనాదిరా ఏటయినాది?

రామయ్య : (రాగంతో ఏడుస్తూ) మావెప్పుడు ఇలేలుపువి నిన్నుకొలవనేదు తల్లో! ఏటా మొక్కు సెల్లించుకొంటూనే ఉన్నామే! ఈఏడూ కొత్తకోకా కోడిపిల్లా సెల్లించినామే! తల్లీ నీదయ తప్పిందేటి ఎల్లమ్మతల్లో!

పోలిగాడు : రామయ్యా! నిన్నేరా! నాదిక్కన్నా సూడకుండా ఏట్రా ఆ ఏడుపేంటిరా! ఏటయినాది!

రామయ్య : తరతరాలబట్టే ఇంటపుట్టిన ఆడపిల్లకి నీపేరే ఎట్టుకుంటున్నాంతల్లో! నీకు తెల్దేటి ఎల్లమ్మతల్లో! మా మేనత్త పేరు నీపేరే తల్లో! మా అయ్యమేనత్తా నీపేరుతోటే బతికింది. మా పెద్దబొట్టికీ నీపేరే ఎట్టుకున్నాం తల్లో! నువ్వు సల్లగా సూడబట్టే దాన్ని అత్తారింటికంపినాను ఎల్లమ్మతల్లో! తరతరాలబట్టి కాపాడుతున్నావే! ఇప్పుడీ ఉత్పాతం తెచ్చిపెట్టినావు తల్లో!

పోలిగాడు : ఏటయినాదిరా! ఏడుపాపరా! ఏటయినాదో సెప్పరా!

రామయ్య : (ఏడుపురాగంతోనే) ఏటయినాదో నాకేంటెరికరా! ఎనకటి రోజుల్లో ఇంటి ముసిల్దాయికి ఆతల్లిపూనేది! మంచీసెడ్డా సెప్పేది - ముసిల్దాయి సచ్చిపోనాది! ఎల్లమ్మతల్లి ఎవిరివొంటినీ వోలడం లేదు! నాకీ ఆపద తెచ్చిపెట్టింది! ఏం సాధనం ఎల్లమ్మతల్లో!

పోలిగాడు : ఏటయినాదే సీతమ్మా! ఎందుకేడుస్తున్నావే! ఏ ఆపద వచ్చి పడిందే! నువ్వన్నా సెప్పు -

సీతమ్మ : (ఏడుపు రాగంతో) ఈదోళ్ల గోల మమ్మల్ని కొట్టేసిందిరా పోలిగా! ఏటిసెప్పనురా పోలిగా!

రామయ్య : ఎవురి గోల ఏటిసేస్తాది! ఎల్లమ్మతల్లి సల్లగా సూస్తే! ఆయమ్మ దయ తప్పిపోనాది!

పోలిగాడు : ఎల్లమ్మ పోలేరమ్మా కాదురా! నీకెటైనాదో ఎందుకనా శోకన్నాలు ఎడుతున్నావో ముందది సెప్పు!

సీతమ్మ : దిక్కుమాలిన మునిసిపాలిటీవోరు బడ్డీ తీసెయ్యమన్నారు ఏటి సెప్ప మంటావు! మాబతుకే ఆబడ్డీరా! బతుకే పోతోందిరా! (రాగంతో ఏడుపుస్వరంతోనే చెప్తుంది)

పోలిగాడు : ఇది రామునాయుడి దెబ్బ!

రామయ్య : అమ్మ! ఎంతమాటన్నావురా! రామునాయుడు సిన్నప్పట్నించి దద్ద దద్దంటూ నన్నొగ్గకుండా తిరుగుతున్నాడే! ఆడు నా జోలికొచ్చినాడంటే నాను నమ్మను.

పోలిగాడు : ఆడి దెబ్బేనని నానమ్మకం! నిజవే! నీ ఎదురుగ్గా నిన్న మొన్నటిదాకా ఆడు గోచీఎట్టుకుని ఎడ్లని తోలుకెల్లినోడే! అగుతే ఇప్పుడెనా ఉన్నాడూ? సిలక్కట్టు కట్టి జలతారుకండువా పైమీదేసుకుని కౌన్సిలేరయి కూసున్నాడు! ఇది ఆడిదెబ్బే! ఇప్పుడు కాసినా ఆడే కాయాల! ఆడికాడికే ఎల్లు! ఆకాయితం సూపెట్టు.

సీతమ్మ : ఈనాటిదీ ఈనాటిదీరా మాబడ్డీ! నాకు తెలకడుగుతున్నాను - మన గూడెం గొందీ రోడ్డూ కలిసిన సోట
మురిక్కాలువ మలుపుకాడ మూడురోడ్ల జంక్షన్ల ఉంది కదా బడ్డీ! దేనికి అడ్డంగా ఉందిరా! ముప్పయి ఏళ్లయి ఉన్నాది! మాయత్త అక్కడే దుకానం ఎట్టిందిట. ఆయమ్మ నిర్వాకం సేయబట్టేకదా నాపెనిమిటి దాన్ని బడ్డీగా సేసినాడు!

పోలిగాడు : నాకు తెల్దన్నట్టు సెప్పుకొస్తున్నావే! సచ్చి సొరగాన్ని ఉన్నాది! ఆయమ్మ నిర్వాకం గురించి గూడెంనో ఎవుడ్నడిగినా కతలు కతలుగా సెప్పుకొస్తారు! రామయ్యకి పట్టుమని పదేళ్లన్న లేవు! పెనిమిటిపోనాడు! పిల్లల్ని సాకడానికి గొందిసివర జంక్షనులో కాలవమలుపుమీద అడ్డంగా రెండు సెక్కలు ఏసి దుకానం ఎట్టిందిట! ఎవడి కాడా సెయ్యి సాపనేదుట!

రామయ్య : మాయమ్మయని సెప్పడం కాదు కాని అది సూపించిన దారినే బతుకు ఎల్లపోస్తున్నాం. మాయమ్మ పెద్ద తాటేకుగొడుక్కింద కూసునేది! జంగిళ్లల్లో కొబ్బరుండలు, సక్కిలాలు, జెంతికలు, బూరెలు, పుణుకులు ఎట్టుకుని అమ్మేది! బఠానీలు, కొమ్ముసెణగలు, మురీలు బుట్టలతో ఎట్టుకునేది! సోలడు - గిద్దెడు - అనా కొనుక్కుని ఎల్లేవోళ్లు. మాయమ్మ అమ్మంది

ఏటుంది. ఉడకబెట్టిన దుంపలు, కర్రపెండలం ముక్కలు, తేగలు, మొక్కజొన్నపొత్తులు, ఏరుసెనక్కాయలు గుడ్డపరిసి పోగులెట్టేది! ముప్పయి ఏళ్లయినాది మనవోర్డు కౌన్సిలేరు భుజంగరావుగారే దుకానం ఎట్టుకుని బతకవే అని మాయమ్మసేత కాయితం ఎట్టించాడు. ఏలుముద్ర ఏయించి కాయితాలు ఇప్పించాడు. అప్పట్నించి ఏటా బడ్డీకి పన్ను కడుతూనే ఉన్నాం.

పోలిగాడు : ఆరోజులు ఎల్లిపోనాయి. ఆమనుసులూ ఎల్లిపోనారు. ఆళ్లు ఈ ఏ ఇబ్బంది చెప్పినా పట్టించుకునేవారు! ఇప్పటి ఎవ్వారమే ఏరు. ఎల్లెల్లు. ముందు ఆ రామునాయుడికాడికెళ్లు. ఆ కాయితం సూపెట్టు.

రామయ్య : ఎల్లమ్మతల్లో! కాపాడు తల్లో!

(విరామ సంగీతం)

రామునాయుడు : దద్దా! ఏమిలాగొచ్చావు? దా దా! ఇలాదా! కూచో!

రామయ్య : కౌన్సిలేరువి కదా! నాకేటొచ్చిందో నీకు తెల్దా? సూడీ కాయితం!

నాయుడు,

జనంగొంతులు : ఏట్రా ఏటి? ఏటి? రామయ్యా! ఏటా కాయితం!

రామునాయుడు : అరెరె! ఎంతపనైపోయింది! ఊళ్లో చాలా బడ్డీలకి గాలొచ్చింది. అందులో నీది ఉందనుకోలేదు. కనుక్కుంటాను. ఇప్పుడే వెళతాను. నోటీసు నాదగ్గర ఉణ్ణీ. దద్దా! నువ్వింటికెళ్లు. అంతా నేను చూసుకుంటాను.

రామయ్య : అమ్మయ్య! రామునాయుడూ! సల్లటిమాట సెప్పినావు. బడ్డీ మాబతుకుస్మీ! ఈ ఆపద గట్టెక్కితే ఎల్లమ్మకి గొఱ్ఱెపిల్లని ఏటేసితెచ్చి నీకిచ్చుకుంటాను. ఎల్లమ్మే నీకాడికి తీసుకొచ్చింది ఇంక నీదే బారం.

జనంలో ఒకడు : ఏటా కాయితం రామునాయుడూ!

రామునాయుడు : ఏమిటని అడుగుతున్నావ్! మీరెవరూ వినలేదా? మునిసిపాలిటీలో రోడ్డుకడ్డంగా ఉన్న బడ్డీలన్నిటినీ తీసెయ్యాలని నిర్ణయించాం. బడ్డీల వాళ్లందరికీ నోటీసులు పంపించాం.

ఒకడు : రామయ్య బడ్డీని పీకీమండమేటి? అది రోడ్డుకి అడ్డమేటీ? భుజంగరావు కౌన్సిలేరు ఎట్టించిన దుకానం. ఆ మారాజు రామయ్యతల్లికి ఇంత ఆదరవు సూపించినాడు. రామయ్య తల్లి సాటున పెరిగి పెద్దై దుకానాన్ని బడ్డీ సేసినాడు!

మరొకడు : సుట్టా బీడీ సిగరెట్టూ సోడా ఏటి కావాలన్నా గూడెంవోళ్లం సిన్న బజారుకాడికి ఎల్లక్కర్లేదు! రామయ్యబడ్డీ గూడేనికి ఎంత సదుపాయం! ఆడిదగ్గర సిన్నాసితకా మన అవుసరాలకి కావలసినవన్నీ

దొరుకుతున్నాయి!

వేరొకడు : అమాయకపు ముండావాడు, సుట్టలు సుట్టుకుంటూ బడ్డీలో కూసుని రోజులు ఎల్లదీస్తున్నాడు. ఆడి బడ్డీ పీకీడం ఏటి? అన్నేయం! దారుణం!

రామయ్య : ఎల్లమ్మతల్లి నాకీ ఆపద తెచ్చిపెట్టింది! ఆయమ్మకి నామీద దయతప్పింది! ఎల్లమ్మతల్లీ! ఈ ఆపద గట్టెక్కించు తల్లో!

రామునాయుడు : దద్దా! నువ్వెళ్లు! మద్దేన్నం నీ యింటికొచ్చి ఏ కబురూ చెపతాను. నానంతా చూస్తాను. వెళ్లు.

రామయ్య : బాబ్బాబు! పర్వానేదంటావా! కనుక్కుంటావుకదా! నీబరాసా ఉంటే నాను దీమాగా ఉంటాను. కొండంత బలం ఇచ్చినావు. మద్దినాల వొచ్చి సెపుతావుకదా!

రామునాయుడు : చెప్పనా? నువ్వింటికెళ్లు. నేనేవస్తాను. నువ్వు రానక్కరలేదు.

(రామయ్య వెళ్లిపోతున్నట్టు అడుగులు దగ్గర నుండి దూరానికి వినిపిస్తూ దూరం అవుతాయి.)

జనంలో ఒకడు : నాయుడూ! పాపం ఏదో ఒహటిసెయ్యి. రామయ్య అమాయకపు ముండావాడు.

రామునాయుడు : చెయ్యనా? మీరు చెప్పాలా?

(విరామ సంగీతం)

రామయ్య : మద్దేనం అయిపోనాది! రామునాయుడు పికరూ పత్తా నేడు. ఏటయినాదో! ఏటిసేసినాడో! ఎల్లమ్మతల్లో!

పోలిగాడు : అనా బెంబేలు అడిపోతే ఎనా? ఆడుకనుక్కుంటానన్నాడు. నువ్వు రానక్కర్నేదు - తానే ఇంటికొచ్చి సెపతానన్నాడు. ఆడు కౌన్సిలేరు! ఆడికి నీ పనొక్కటేనా? ఆడికి ఎన్నెన్ని యాపకాలుంటాయి!

సీతమ్మ : నానూ అదే అంతన్నాను. సిటమో సిటమో వస్తాడు. బెంబేలడి శోకాలు ఎడితే అగుద్దా అంతన్నాను.

రామయ్య : మా పొరుగున ఉన్నోడివి కాబట్టి నాతోపాటు నువ్వూ నా ఇంట కూకుని దైర్నం సెపుతున్నావు. ఆకాగితం ముక్కొచ్చిన కాడినుంచీ ఏటీ తోచట్నేదు. ఇయాళ బడ్డీ తెరవనేదు! ఎల్లమ్మతల్లీ! మణ్ణీ బడ్డీ తెరిపించు తల్లో!

పోలిగాడు : అడుగో అటుసూడు. నాయుడే! వస్తున్నాడు ఇటే వస్తున్నాడు!

రామయ్య : వచ్చేవా! ఇచ్చిన మాట నిలబెట్టుకున్నావ్! రామునాయుడు పండేనా?

రామునాయుడు : దద్దా! పెద్దచిక్కేవచ్చింది. నీకొక్కడికే రాలేదు. ఊళ్లో నలభైబడ్డీల వాళ్లకొచ్చింది. ట్రాఫిక్కు పెరిగిపోయింది. జంక్షన్లో బడ్డీలన్నీ

పీకీమన్నారు. అసాధ్యం వచ్చింది. ఎలాగా అని తటపటాయిస్తున్నాను.

పోలిగాడు : అసాధ్యం వొచ్చింది గనుకనే నువ్వుసాధ్యం చెయ్యాలి.

రామునాయుడు : చేస్తానురా! అదే తటపటాయిస్తున్నాను. కమీషనరు ఏక్షను తీసేసుకున్నాడు. అక్కడే చిక్కుగా ఉంది. ఏదో అస్త్రం వేస్తానులే.

సీతమ్మ : రామునాయుడూ! నువ్వాడుతున్న మాటలు నాకేటీ తెలీడం నేదు. సల్లటిమాట సెపతావని పిల్లాది సూస్తున్నాము. పిల్లలూ మావూ యిప్పుడే గంగలో పడ్డం! బడ్డీ వే మా బతుకు! నువ్వేరగందుందా? సెప్పుమీ! (ఏడుస్తూ రాగాలు తీస్తుంది) సూడు అటు నా పెనిమిటి గోడకి జారబడిపోనాడు. నోటమాట రాక వోలిపోయినాడు.

రామునాయుడు : ఎంతమాటన్నావ్ సీతమ్మా! బడ్డీ వొగ్గేస్తామా? బతుకులో బుగ్గేస్తే వూరుకుంటామా? అందుకే తటపటాయిస్తున్నాను.

రామయ్య : (పెద్ద గొంతుకతో) ఇదిగో నీబడ్డీ. ఇక్కడ బతుకు అని ఆర్డరు తేకపోయినావా నాను నుయ్యో గొయ్యో సూసుకుంటాను.

రామునాయుడు : ఎందుకు దద్దా! అటువంటిమాటలు! ఈ కాగితం మీద సంతకం చెయ్యి. ఇదిగో పిటీషను. రాయించే తెచ్చాను. చదివి వినిపించ మంటావా? మహారాజశ్రీ కమీషనరు గారి దివ్య సన్నిధికి రామయ్య రాసుకున్న పిటీషన్ విన్నపాలు...

రామయ్య : నువ్వు ఎట్టే పిటీసను పకడ్బందీగానే ఉంటుందినే - అందునో సందేహం ఏటీనేదు. బాగా సదూకుని గూడెం మొత్తానికి మొనగాడివి అయ్యేవు. మాకదే శాన.

పోలిగాడు : సదివి ఇనిపించక్కర్నేదునే. అగుతే ఆల్లమ్మ దుకానం ఎట్టిన కతా అప్పటి మునిసిపలు కౌన్సిలేరు భుజంగరావు సాయంగా ఎట్టించినాడని రాయించినావా?

రామునాయుడు : రాయించకుండా ఉంటానురా? ముప్ఫై ఏళ్లయి పన్నులు కట్టుకుంటూ ఉన్న బడ్డీని తీసెయ్యండం న్యాయం కాదని గట్టిగా రాయించినాను. అదిగందుకే చదివి వినిపిస్తానన్నాను.

రామయ్య : ఇనాతే ఆ కాయితం! ఎల్లమ్మతల్లీ నీదే బారం సంతకం ఎట్టి రాము నాయుడి సేతినో ఎడుతున్నాను. కాపాడుతల్లో!

సీతమ్మ : నాయుడూ! నీదేబారం. ఏటిసేస్తావో ఎనాసెస్తావో గండం తప్పించు నాయినా!

పోలిగాడు : నాయుడు తల్చుకుంటే పనవకుండా ఉంటాదా! మరి తకర్నేదు. పిటీసను ఎట్టిస్తున్నాడు కదా!

రామునాయుడు: వస్తాను దద్దా! శనారానికి ఏసంగతీ తెలుస్తుంది. శనారం భజనకి రాంమందిరం కాడికి వస్తావుగా! అక్కడికే కబురు పట్టుకువస్తాను. మరి వెళ్తాను.

(విరామ సంగీతం)

(రామమందిరం భజన వినపడుతూ ఉంటుంది. అందరి గొంతుకల మధ్యా రామయ్య గొంతు మరింత గట్టిగా వినపడుతూ ఉంటుంది.)

రామారామా! రఘురామా! ఘనశ్యామా!

రామారామా! గుణధామా! పరంధామా!

రామారామా! దశరథరామా! జానకీ రామా!

ఒక గొంతు (గట్టిగా) - ఆపండస్సెయ్యి! రామునాయుడొచ్చేడు! ఆపండస్సెయ్యి!

(భజన ఆగిపోతుంది)

రామయ్య, సీతమ్మ : వచ్చావా రామునాయుడు! ఆర్డరు ఏయించినావా?

రామునాయుడు : ఏంచెప్పను? ఎనా చెప్పనా అని గుంజాటన పడుతూనే వచ్చేను. నాచేతిలో ఏముంది? ఎంతచెప్పినానెంతచెప్పినాను. ససేమిరా పనికిరాదు తీసెయ్యాల్సిందే అన్నారు. ట్రాఫిక్కుకి అడ్డంగా ఉంది. అసలా గొందిని వెడల్పు చెయ్యాల్సి ఉంది. గుడిసెలు అడ్డం లేకపోతే రోడ్డువెడల్పు అయిపోయేది! మునిసిపాలిటీకి డబ్బులేదుగాని గుడిసెలు పీకేసి రోడ్డు విశాలం చెయ్యవలసిన పథకాలు ఉండడం ఉన్నాయి. ఇళ్లనే పీకెయ్యవలసి ఉంటే బడ్డీలు ఉంచుతారా? ససేమిరా అన్నారు.

ఆడామగా

గొంతులు : ఏటీ ఘోరం! అన్నేయం!

పోలిగాడు : ససేమిరా అని అంటే నువ్వుగట్టిగా చెప్పొద్దా?

రామునాయుడు : ఏంచెయ్యనూ? రోజులలాగున్నాయి!

జనం ఆడమగా

గొంతులు : కుడీ ఎడమా లేదా? ఉపాయం చూడాలి.

ఒకరు : రామునాయుడన్నదీ నిజమే! ఇప్పుడు రోజులలా ఉన్నాయి.

మరొకరు : రామయ్యతల్లినాటి కౌన్సిలేరు భుజంగరావుగారెక్కడా! ఇప్పటి వాళ్లెక్కడా? ఆయున గుఱ్ఱం బగ్గీమీద వచ్చేవాట్ట! ఈ రాంమందిరం కట్టించిందీ సింహాల తోరణం ద్వారం పెట్టించిందీ, మందిరం ఎనకాల తాళింఖానా ఏర్పాటు చేయించిందీ ఆ

బాబేకదా!

వేరొకరు : మన రామంద్రం నాంటిది మరోటి ఊళ్లోనే లేదు! కొబ్బరి మొక్కలు-పువ్వులమొక్కలు-దీని అందం దేనికుంది! ఆ హంసలు చెక్కిన సెమ్మే! అదీ ఆ ప్రెబువు ఇచ్చిందే!

ఇంకొకరు : అంటే ఏట్రా! రామునాయుడు ఏటి చెయ్యనేదంటున్నారా?

మరొకరు : నేనలా ఎక్కడన్నాను! అప్పటి మనుసులు మన కోసం చేసేవారూ అన్నాను. మన ఇబ్బందుల్ని కనిపెట్టేవారూ అన్నాను. అబద్దకమా? రామునాయుణ్ణే ఉపాయం చూడమను. ఎవురొద్దన్నారు?

రామునాయుడు : మీకు తెలియంది ఏముందీ? ఇప్పుడు మనుషులతో మాటాడగలమా? వాళ్లదాహాలు ఎలాగున్నాయి? ఏనుగు తొండాలు జాపుతున్నారు.

పోలిగాడు : రామయ్యా! నువ్వు ఎల్లమ్మకి గొఱ్ఱెపిల్లని బలిఏస్తానన్నావ్ - ఓరి తెలివితక్కువ్వాడా! మనుషులు బలికోరే వారు ఉన్నారు. ఎల్లమ్మకి బలి ఎయ్యకపోయినా ఊరుకుంటుంది. మనుషులకి బలి ఎయ్యకపోతే ముప్పొచ్చి పడుతుంది.

సీతమ్మ : పారేస్తాం నాయినా! అనాగే పారేస్తాం. పారేసైనా మా బడ్డీ మాకు నిలబెట్టు.

పోలిగాడు : అనాగ్గానేనాసెయ్యి.

రామునాయుడు : ఆమాట మీనోటితోటంటే బాగుంటుంది. నానోటితోటంటే నేనేదో తినేసినట్టుంటుంది.

రామయ్య : దద్ద దద్దంటావు, దద్దనేం చేస్తావో చెయ్యి. ఎవిడికియ్యాలో ఇయ్యి. (బాధగా అంటాడు.)

రామునాయుడు : ముందు రెండువొందలు జతపెట్టు. అదీ చూసేద్దాం

రామయ్య : అనాగే నీ ఇంటికి తెచ్చి ఇస్తాను. ఇంకేం బజన! బజనపాట. పద -పదొలే కొంపకి పోదాం.(రామయ్య మాటలు ఫేడవుటవుతూ పోతాయి)

కలగాపులగపు గొంతులు : పాపం రామయ్య! పాపం రామయ్య!
రామా రామా! దశరధ రామా! ఘనశ్యామా!
రామా రామా! జానకి రామా! రఘురామా!

(భజనపాట తాపీగా ఫేడవుట్ అవుతుంది)

విరామ సంగీతం

సీతమ్మ : రేతిరి రొండొందలు ఇచ్చొచ్చినావు. ఇయ్యాళ సెపతానన్నాడ? అనా దిగాలుపడి కూకుడున్నావు! నాయుడిని నాను ఎల్లి కనుక్కుని రానా?

రామయ్య : నాయుడే మనింటికి వచ్చి సెపతానన్నాడు!

పోలిగాడు : సొమ్ము సేతినో ఎట్టినాక పనవకుండా ఉండదునే! ఈదపా నాయుడు సల్లటిమాటే సెపతాడు.

(రామునాయుడు గొంతు దూరం నుంచి రామయ్యా రామయ్యా అని వినిపిస్తూ దగ్గరగా వస్తుంది)

పోలిగాడు : నాయుడూ పని అయినాదా?

రామునాయుడు : పైసా ఎవడికీ ఇయ్యలేదు.

సీతమ్మ,

రామయ్య : పని అయింది కద!

రామునాయుడు : పనౌతుందంటే సొమ్మెయ్యినూ? ఎందుకు నీ సొమ్ము పాడు చెయ్యడం? ఇందా ఇదిగో నీ సొమ్ము!

రామయ్య : ఎల్లమ్మతల్లో! ఎల్లమ్మతల్లి! నానేగంగలో పడనుతల్లో!

పోలిగాడు : ఏటైంది నాయుడూ! సొమ్ము తెచ్చేసినావు!

రామునాయుడు : పనికాలేదురా! జంక్షనులో బడ్డీ ఉండడానికి ఎంతమాత్రం సావకాశం లేదు అన్నారు.

సీతమ్మ : పిల్లా పాపల్తో మావేగోతినో పడ్డం దేవుడా! ఎవుడికీ ఏనాడూ అన్నేయం సేయనేదే! మమ్ముల్ని ఇనా ఏడిపిస్తున్నావేటి దేవుడా! (ఏడ్పు)

రామయ్య : ఎన్ని మొక్కులు మొక్కుకున్నాను తల్లీ! నన్నుకాపాడవా ఎల్లమ్మ తల్లీ! ఏటితప్పయిపోనాదో సెప్పవేం తల్లో! (ఏడ్పు)

రామునాయుడు : ఏడిస్తే ఏంలాభం దద్దా! ఉపాయం చూడాలి. నాకొక్కటి తట్టింది. చెప్తావిను. దద్దా! దద్దా! వింటున్నావా!

రామయ్య : నాను దద్దనికాను. దద్దమ్మని. ఇక నాకేటి సేస్తావు నువ్వు!

రామునాయుడు : వినరా దద్దా!

రామయ్య : సెప్పు

రామునాయుడు : జంక్షను దగ్గరైతే ఇంక బ్రహ్మతరం కాదు. అక్కడ ట్రాఫిక్ రద్దీ ఎక్కువైంది. ఐతే ఒకటి చెయ్యొచ్చు. ఏమిటంటావా? జాగ్రత్తగా విను! ఇప్పుడు నీబడ్డీ ఉందా? దాన్ని ఒక పదడుగులు గొందిలోకి జరిపి కాలువమీద పెట్టుకుంటావా? చెప్పు. ఒక పదంటే పదడుగులు లోపుకి జరుపుకో. ఆర్డరు వేయించి తెస్తాను. గూడెం మధ్యలో ఉంటుంది. నీబేరం ఎక్కడికీ పోదు. ఆలోచించి చెప్పు.

పోలిగాడు : గనమైన ఆలోసన సెప్పినావు రామునాయుడూ! సెయ్యి! అనాసెయ్యి. రామయ్యకి గూడెం బేరమెక్కిడికీ పోదు.

సీతమ్మ : ఓ సెయ్యి బాగుంది. అనాసెయ్యి. అదిసెయ్యి.

రామయ్య : అవును అది బాగుంది. ఎల్లమ్మదయతో అనాసేయించు. అనాగే జరుపుకుంటాను. అదిశాన.

రామునాయుడు : చెప్పేను కాని దానికీ దూతలున్నారు. ఖర్చు అవుతుంది.

రామయ్య : ఇయ్యనే ఇచ్చేను రెండొందలు. అప్పుతేనే తెచ్చేను రొండొందలూ పట్టుకెళ్లు.

రామునాయుడు : ఈపిటీషను మీద సంకతం పెట్టు. అర్జీవిన్నపములు రాయించాను. కాస్త పదడుగులు గొందిలోపుకి జరిపి బడ్డీని పెట్టుకోనివ్వాల్సిందిగా రాయింపించాను.

రామయ్య : అనాగే.

సీతమ్మ : ఈపాలి ఆర్డరు సేతికి ఎంటనే వొస్తుందంటావా?

రామునాయుడు : మూడోరోజుకి ఆర్డరుపడి కాయితం మనచేతికి వస్తుంది.

పోలిగాడు : జంక్షన్ కాడినుంచి పదడుగులు గొందిలోపుకి జరిపిపెట్టు కుంటానన్నావు. మరిక తగాదా ఏటుంటాది?

రామయ్య : మరే! ఎల్లమ్మతల్లి ఇనా అయినా సూస్తే అంతే శాన! అదే శాన!

(విరామ సంగీతం)

పోలిగాడు : ఏట్రా రామయ్యా! నాలుగు రోజులైపోనాది! మనిసీనేడు. ఆర్డరు కాయితమూనేదు. నువ్వు దిగాలుపడికూకున్నావు సరే రాము నాయుడూ దిగాలుగానే ఉన్నాడని నారిగాడు సెప్పేడేంట్రా!

సీతమ్మ : నారిగాడి సెవినో నాయుడు సావుకబురు సల్లగా ఏసినాడు! కమీష నరు సంతకం సెయ్యనేదుట! సొమ్మూ పోయి శనిఒట్టుకుంది.

పోలిగాడు : కమీషనరు సంతకం ఎందుసేత సెయ్యనేదూ?

రామయ్య : ఏటి తిరకాసో మనకేటి ఎరుక! నాయుడు సెపితే తెలుస్తుంది.

పోలిగాడు : నాయుడు రానేదు! వస్తానన్నాడా?

సీతమ్మ : వొచ్చిసెప్పడా! సొమ్మెట్టికెళ్లినాడు. ఏటయినాదో వొచ్చి సెప్పడా! సేయించేస్తాను గొందినోకయితే అన్నోడు ఏటయినాదో ఇనా సంతకం ఎందుక్కానేదో వొచ్చి సెప్పడా!

(విచారంగా దద్దా! దద్దా! అనే రామునాయుడుగొంతు దూరం నుంచి వినిపిస్తూ దగ్గరికి వస్తుంది.)

పోలిగాడు : ఏటినాయుడూ! కమీషనరు సంతకం సేయనేదుటా ఏంటికతా! మన్నీ

మొదిటికొచ్చిందా ఎవ్వారం!

రామునాయుడు : కొద్దిరోజుల్లో ఆయన బదిలీ అయి వెళ్లిపోతున్నాడు, రాబట్టు కోవాలని ఆశ ఉండదా!

సీతమ్మ : సచ్చిపోనాము!

రామునాయుడు : చేస్తాననే అన్నాడు. కాయితం దగ్గర కొచ్చేసరికి నిలబెట్టేశాడు.

పోలిగాడు : ఏపాటి ఇస్తే సరిపోతుంది?

రామునాయుడు : అమ్మో! కమీషనరుగారికి మనం ఇచ్చుకోగలమా?

పోలిగాడు : మరి రెండొందలెవురికి ముట్టినాయి?

రామునాయుడు : క్రింది దూతలకిరా!

పోలిగాడు : పెద్దదూతకెంత?

రామునాయుడు : ఐదొందలకి తక్కువైతే ముట్టడు. అమ్మో! మనమిచ్చుకోలేం!

పోలిగాడు : ఆడికొంపకగ్గి పెట్టెయ్యమను.

సీతమ్మ : అమ్మో! అంతసొమ్ము ఎక్కడ తేమూ? (ఏడుస్తూ)

రామయ్య : ఇదంతా ఏటి ఇనా గొచ్చింది! ఏటీరాత తల్లో!

రామునాయుడు : దద్దా! ఇప్పుడు లోకమలాగుంది!

రామయ్య : నన్నేటి సెయ్యమన్నావు!

రామునాయుడు : ఈ కమీషనరు ఎలాగూ పోతున్నాడు. మరొకడొస్తాడు. అంత వరకూ ఉందాం.

పోలిగాడు : కింది దూతలకిచ్చిన రెండొందల మాటా?

రామునాయుడు : తిరిగి నాకొడుకులు ఇస్తారా? అందుకే తటపటాయిస్తున్నాను. అవి గంగపాలు కాకుండా ఆర్డరేయించుకోవాలి.

సీతమ్మ : మామెక్కడి నుండి తేము ఐదొందలూ! ఓరి తండ్రో!

రామునాయుడు : రేపు మళ్లీ కమీషనరుగారితో చెప్పిచూస్తాను. ముప్పైఏళ్లబట్టీ ఉన్నాడు, బడ్డీ పీకేస్తే వాళ్ల పీక కోసుకుపోతుంది అని చెపతాను మళ్లీ.

పోలిగాడు : ఇనకపోతే!

రామునాయుడు : కొత్త కమీషనరు వొచ్చేదాకా ఉందాం.

పోలిగాడు : కోళ్లు తినేవోడు పోయి గొఱ్ఱెలు తినేవోడువొస్తే?

రామునాయుడు : మనదృష్టం ఎలాగుందో! మరోసారి కమీషనరుగారితో చెప్పి చూస్తాను. ఆతర్వాతే ఆలోచిద్దాం. మరినే వెళ్తాను.

(రామునాయుడు వెళ్తున్నట్టు - దగ్గర్నుంచి దూరానికి ఫేడవుట్)

పోలిగాడు : రామయ్యా! ఇదంతా రామునాయుడి నాటకమే! పచ్చిమోసం. నువ్వుపచ్చగా ఉన్నావని పట్టుకున్నాడు. చిలుం వదలగొట్టదలచు

కొన్నాడు.

రామయ్య : ఏటనా అంటున్నావు!

పోలిగాడు : రామయ్యా! ఇకనాబంనేదు. ఎక్కడ ఏడుస్తావో ఏడువు. ఐదొందలు ఆడి ముఖాన్ని పారీ. బడ్డీ నిలుపుకో.

రామయ్య : ఇదంతా రామునాయుడి మోసమంటావా?

పోలిగాడు : తప్పకుండా!

రామయ్య : తొలిడబ్బు తీసికెళ్లి తిరిగిచ్చీశాడూ!

పోలిగాడు : మనకి నమ్మకం పుట్టొద్దా!

రామయ్య : ఐదొందలూ తినేసి పనిసెయ్యకపోతే?

పోలిగాడు : అదినిక్కచ్చిగా అడిగి నలుగుర్లో ఇద్దాం.

(విరామసంగీతం)

సీతమ్మ : ఏడొందలు పోతేపోనాయి కానీ కమీషనరు గారు దస్యత్తు ఎట్టి మరీ ఎళ్లాడు. ఆర్డరుకాయితం ఇచ్చీసినాక బదిలీ మీద ఎళ్లాడు. ఆరొం డొందలూ, ఈ ఐదొందలూ డబ్బానోఏసి ఉంచిందే తీసిచ్చినాను. మెళ్లో నానూపట్టెడా తీసేసి పెట్లో పడేశాను. నామెల్లో బంగారం బంగారంనాగ కనపడుతూ ఐదొందలు ఇచ్చామని తెలిస్తే ఇంకేటన్నా ఉందా? గూడెంగూడెం అంతటికీ కన్నెర్రే! బడ్డీమీద బాగా డబ్బు సేసుకున్నామనీ, నాను బంగారం ఎట్టుకున్నాననీ కంట్లో నిప్పులు పోసుకుంటున్నారు. పైపైకి మనం అన్నేయం అయిపోయేమని అన్నారేకాని లోలోపల ఈళ్లకి ఇంతే కావాలి అనే అనుకున్నారు. బాగుంటే ఓర్వలేరు జనం!

రామయ్య : మామంచి పనిసేసినావు! నాకు మాత్రం తెల్దేటి? ఏడొందలంటా వేంటి? జంతిలోకి బడ్డీ జరుపుకోవడానికి మరో పాతిక వనేదూ? గుడ్డిలోమెల్ల! ఎల్లమ్మతల్లికి మొక్కుకున్నందుకు, ఆయమ్మని నమ్ము కున్నందుకు ఇదిగీపాటి చమురొదిలినా బడ్డీ గూడెంనోనే ఉన్నాది. ఏటపోతునేసి నాయుడకిచ్చేసినాను అది గందుకే! ఇదిమనకి శాన!

సీతమ్మ : పోలిగాడికి మాత్రుం రామునాయుడిమీద మాకసిగా ఉంది. ఆరాలు తీస్తున్నా. అస్సల్సంగతి సెప్తా నుండప్పా అన్నాడు. ఆడి మోసమే ఇదంతా అంటాడు. ఓరోరి మాటలోనే వొచ్చీసినావు! నూరేళ్లు బతుకు తావు. నీమాటేసెపుతున్నా.

పోలిగాడు : నాను సెప్పనేదా అప్పా! ఇదంతా నాయుడినాటకమే! పద్దైనా గుమాస్తాల కిచ్చాడో నేదో! ఈడే కాజేశాడు. ఎల్లిపోయిన కమీషనరుగారు

దేముడురా రామయ్య! కానీ లంచం పుచ్చుకోడని ఊరంతా కోడై కూస్తున్నాది. ఊళ్లో పెద్ద ఆయన్ని బదిలీ చెయ్యొద్దని కాయితాలు ఎట్టినారుట!

రామయ్య : పోన్నేరా! పోయిండబ్బురాదు. ఆడిపాపాన్ని ఆడే పోతాడు. ఎల్లమతల్లి సూస్తున్నాదికదా!

సీతమ్మ : ఎవులికీ ఏనాడూ ఏపాపం సేసినోళ్లం కాదు. బగమంతుడి మీద బారవేసి బతుకుతున్నాం. మీదివోడి దయ ఉంటే మిద్దెఇల్లు మేడౌతాది!

పోలిగాడు : ఆడికి ముందేటి జరిగినా ముందు మనకి ఏడొందలొందిలినాయి. కులపోళ్లని కూడకట్టుకుని కౌన్సిలేరు అయ్యేడప్పుడు! మళ్లీ వోట్లెక్సన్లు రావా? అప్పుడీ నాకొడుక్కి గూడెమంతా ఎదురుతిరిగి కాజాయివ్వాలి!!

(విరామసంగీతం)

(రాంమందిరం, గంటకొట్టడం - పెసాదంపుచ్చుకోరా - ఇత్యాదులతో జనం మాటలతో సూచించాలి)

ఒకరు : నువ్వు ఎయ్యిసెప్పు నచ్చసెప్పు.నంచం పుచ్చుకున్నా రాము నాయుడితో సెప్పేవో సెప్పినపని అయితీరుతుంది. అందునో డోకానేదు.

మరొకరు : నాను కొత్తకొంప కట్టుకున్నానా! కుసింత సెయ్యి తడిపినాననుకో. అగుతేమాత్రుం ఏతకరారూ నేకుండా నాపని అయిపోనాది కదా!

ఇంకొకరు : నాల్గుడబ్బులు తీసుకున్నా నాయుడు మనకి ఏ ఇబ్బందీ లేకుండా సూస్తున్నాడు అది నిజం.

వేరొకరు : ఆడికి జీతవా? బత్తెవా? ఆపాటి సూసుకోకపోతే ఆడి దినమెలాగ ఎలుతుందీ? ఊరికే ఎవ్వరూ ఇవ్వరు కదా! ఉపకారంసేస్తే కాస్త పుచ్చుకుంటే తప్పేటీ అంట!

ఒకరు : రామయ్య బడ్డీ పూరాగా పీకించేసి ఉంటే ఆడి బతుకేటయ్యేది? నాయుడు ఉపకారమే సేసేడు. ఉపకారం సేసినా సేసేడని నోకం అందు. తినేశాడు అంటుంది. ఎంతాడుతిన్నాడూ - దూతల కెంతిచ్చాడూ - ఈ ఇవరాలు ఎవుడికీ అక్కర్నేదు!

మరొకరు : ఒల్లకుండ్రా! మాసెడ్డ సెపొచ్చినారు! ఆడ్ని సూస్తున్నారా! ఎంతగనంగా దరిజాగా బతుకుతున్నాడో! ఎంతజోరుగా ఖర్చు చేస్తున్నాడు!! ఉపకారస్తుడట! ఉపకారస్తుడు! ఆడిదరజా ఆడుసేసే ఆఖర్చూ సూస్తే తెనీడం నేదూ ఆడు ఎటువంటోడో!!

వేరొకరు : నోర్మూయ్యండ్రా! శనివారం మందిరానికి బజనకొచ్చేరా! సెడ్డవాగుడి కొచ్చేరా! అడిగో రామయ్యా వొచ్చేడు. బజన మొదలెట్టండి.

రామా రామా! రఘుకులనందన శ్రీరామా!
రామా రామా! రఘుకుల నందన శ్రీరామా!
రామా రామా! దశరథ నందన శ్రీరామా!
రామా రామా! మునిజన వందన శ్రీరామా!

(దద్దా! దద్దా! ఓదద్దా! అని పిలుస్తూ వచ్చే రామునాయుడి గొంతు దూరం నుండి దగ్గరవుతూ వచ్చి గట్టిగా భజన మధ్య నుండీ వినిపిస్తుంది)

(భజన ఆగిపోతుంది.)

రామునాయుడు : దద్దా - కొత్త కమీషనరుగారు వచ్చారు. నువ్వు కాయితం పెడితే బడ్డీని మళ్లీ నీమామ్మోలు చోటికి జంక్షనుకి మార్చీవొచ్చు, పెడతావా?

రామయ్య : మళ్లీ మార్చా? ఒకతూరి మార్చినందుకు పాతిక రూపాయిలైనాయి!

రామునాయుడు : ఏమో చూసుకో - ఇప్పుడు మార్చుకోవచ్చు. జంక్షను ఆలోచించుకో!

సీతమ్మ : వొద్దునే. బడ్డీగొందిలోనే ఉండనీ! మళ్లీ జంక్షనెందుకూ?

పోలిగాడు : జంక్షను జంక్షనేకదా! జంక్షనుకి ఎల్లడమే మంచిది!

రామునాయుడు : అగుతే ఒక్కటుంది. రామయ్యా! నీకు రెండువొందలు ఖర్చు అవుతుంది.

రామయ్య : అమ్మో! మళ్లీ ఖర్చా? ఇప్పటికే అప్పులపాలయినాం!

రామునాయుడు : నీ యిష్టం దద్దా! నీకు చెప్పాలికదా! చెప్పేను! ఆలోచించుకో.

రామయ్య : మళ్లీ రెండొందలు లంచం పొయ్యాలా?

పోలిగాడు : మళ్లీ లంచం కట్టాలంటే వొద్దునే! గొందిలోపుకి జరుపుకున్నా నీ ఖాతాల్లో ఒక్కటంటే ఒక్కఖాతా అన్నా పోనేదు. బేరం పిసరు తగ్గనేదు. నీయాపారానికి తఖర్నేదు! మళ్లీ ఎందుకు వొద్దునే!

రామునాయుడు : దద్దా! ఆలోచించుకుని చెప్పు. మళ్లీవారానికి చెప్పినా చాలు. ఆలోచించుకునే చెప్పు.

రామయ్య : మళ్లా ఎందుకు? ఇప్పుడు నాకేం నోటునేదు.

రామునాయుడు : జంక్షనులో బడ్డీ! చిరకాలం నుంచీ ఉన్నావు. ఇప్పుడు అవకాశంగా ఉంది. నీయిష్టం మరి. నీయిష్టమొచ్చినట్టూ చెయ్యి. మళ్లీ నేను చెప్పలేదు అనుకోకూడదు. నీయిష్టమే. నిర్ణయించుకో-

రామయ్య : వొద్దునాయుడూ! వొద్దు! నేనుమరి కదల్లేను. ఏదో ఇనాగ మీమధ్య బతకనీయండి. శాన. అంతేశాన!

(భజన మళ్లీ మొదలవుతుంది)

రామా రామా రఘుకులనందన రామా శ్రీరామా!
రామా రామా దశరథనందన రామా శ్రీరామా!

(విరామ సంగీతం)

రామయ్య : పూరాగా ఎల్లిపోయినా. గూడేన్ని ఒగ్గే ఎల్లిపోయినా. మా అత్తారూరు పాలెం ఎల్లిపోయీ పాలెం రోడ్డువోర బడ్డీ నిలబెట్టుకుని ఎల్లమ్మతల్లికి కోడిపిల్ల మొక్కు చెల్లించుకున్నా. ఎల్లమ్మతల్లి పట్నం నుంచి పాలెంకు పంపించేసింది! బారం అంతా ఆతల్లిదే!

పోలిగాడు : ఏటో!మన అమాయకత్వానికి నవ్వాలో ఏడవాలో తేలీటం నేదు. మనకళ్లని మనం సూసినాం. నువ్వు వొద్దూ మళ్లీ జంక్షనుకి మారనూ అన్నావు - నానూ అదే మంచిదీ అన్నాను- మనంవొద్దు అని వోరం అన్నా తిరగనేదు! ఎనిమిది అడుగుల ఎత్తు బడ్డీని నిలబెట్టేసేరు! మళ్లీ అందునో ఎవుడి పేర్న? ఆడు రామునాయుడి మేనల్లుడు! పదడుగుల వెడల్పు బ్రహ్మాండమైన బడ్డీ! ట్యూబులైటు బిగించేసేరు!

సీతమ్మ : నోరెళ్లబెట్టి మనం సూడ్డమే మిగిలినాది! ఆ టూబునైటు ఎలుగులో గూడెంగొందేంటి - మూడురోడ్ల జంక్షనేంటి పట్టపగల్లా మెరిసిపోతూంటే!

రామయ్య : కురసగా గొందినో ఉన్న మన బడ్డీకెవుడు వస్తాడు. నువ్వు మా ఊరుపాలెం పోదాం అంటే నానూ బుర్రూపేను - అక్కడే మడిసెక్క కొనుక్కుందాం అంటే బుర్రూపేను.

పోలిగాడు : ఆడి బడ్డీకి జనం రారా! ఓరి ఎర్రోడా! బెంచీలు ఏసేరు. కుర్సీలు ఏసేరు. నాయుడూ అక్కడే కూకుంటున్నాడు. ఇరగబడరా జనం! నాటుసారా అమ్మకమా? మజాకానా? బయంనేకుండా ఎవుడైనా తాగి బోర ఇడుచుకొని ఎల్లొచ్చు! రామునాయుడి దుకాణంకద!

సీతమ్మ : పెద్దపెద్ద ఆసిగరెట్టు పాకెట్లేంటి? బీడీకట్టలేంటి? సోడా బుడ్డులేంటి. కలర్లో! రంగురంగుల గాజు జాడీలేంటీ. కళ్లు జిగ్గుమనవూ?

రామయ్య : ఎనకటి రోజుల్లో ఇంటి ముసిల్దాయికి ఆతల్లి పూనేది. మంచీసెడ్డా సెప్పేది. ముసిల్దాయి సచ్చిపోనాది. ఎవురి వొంటినీ వోలడం నేదు. ఏటయినాదో? ఆ ఎల్లమ్మతల్లికే ఎరిక! ఆ ఎల్లమ్మతల్లికే ఎరిక!

లోపల్నించి
కొన్నిగొంతులు : ఎల్లమ్మతల్లికే ఎరిక! ఆ ఎల్లమ్మతల్లికే ఎరిక!

లైట్సాఫ్ - తెర

(కొద్దిమార్పులతో ఆకాశవాణి హైదరాబాద్ నుండి ప్రసారితం)

కథప్రచురణ : **1969-డిశంబరు-జ్యోతి**

.......................................................................................

# వాయులీనం

శ్రవ్యనాటిక

(ఆటో ఆగిన చప్పుడు)

వెంకటప్పయ్య : నెమ్మదీ నెమ్మది. ఇటుపక్క నుంచిదిగు. నా భుజంమీద చెయ్యివెయ్యి. జాగ్రత్త. మెట్లెక్కగలవా? ఇన్ని మెట్లు? లేవరా, లే, అడ్డులే.

పిల్లలు : అమ్మొచ్చేసిందీ... అమ్మొచ్చేసిందీ! అమ్మొచ్చేసిందీ!

వెంకటప్పయ్య : పిల్లలూ, గోల చెయ్యకండర్రా. అమ్మకింకా పూర్తిగా తగ్గలేదు. మీరు అల్లరి చెయ్యకూడదు. వసారాలో ఆడుకోండి. తెలిసిందా?

పిల్లలు : సరే నాన్నా

వెంకటప్పయ్య : రాజ్యం!

రాజ్యం : ఊ

వెంకటప్పయ్య : ఇల్లు బాగుందా?

రాజ్యం : ఆ!

వెంకటప్పయ్య : కొత్తగా కట్టిన సిమ్మెంటు డాబా.. గదులు రెండూ చిన్నవి అనుకో! అ... ఇదిగో ఇటు వసారా ఉంది. చూడు.. ఇంటి చుట్టూ ఎంత పెరడో... ఎంత విశాలంగా ఉందో...

రాజ్యం : మరే!

వెంకటప్పయ్య : ఈ ఇంటిపెరడే కాదు. ఈ వీధిలో ఉన్న ఇళ్ళ పెరళ్లన్నీ పూల తోటలే.

రాజ్యం : అలాగా!

వెంకటప్పయ్య : ఆ... నీకు కాస్త ఓపిక వచ్చాకా చూద్దువుగానిలే. మన పెరటిలోనూ పువ్వులున్నాయ్. అ...ఎదురుగా ఆ మేడ చూసావా? చూడముచ్చటగా లేదూ?

రాజ్యం : పోన్లెండి. మంచి ఇల్లు దొరికింది. అక్కడ ఆ ఇరుకు సందూ ఇక్ష్వాకుల నాటి పాతగూభ్యం కొంపా! మరి అందుకే అక్కడ అద్దెచవక. దీనికెంత అద్దో!

వెంకటప్పయ్య : అద్దె కాస్త ఎక్కువే అనుకో! ప్రాణానికే క్షేమం లేని తర్వాత వెధవ అద్దెకు చూసుకుంటామా?

రాజ్యం : అద్దె ఎక్కువంటున్నారు. ఎలాగో ఏమిటో?

వెంకటప్పయ్య : ఏ బెంగావద్దు. వెధవడబ్బు. ఏదో కూడిక చేసుకుంటాం! నువ్వు బతికేవు! అంతేచాలు!

రాజ్యం : మీరన్నదీ నిజమే! చవకని ఆపాత గూభ్యం కొంపలో ఉన్నామన్న మాటేగాని ఎప్పుడూ ఎవరికో ఒకరికి ఏదో ఒకటి అనారోగ్యమే!

వెంకటప్పయ్య : మెల్లిగా అంటావ్! ఇంటిల్లిపాదికీ అక్కడున్నన్నాళ్లూ రోగాలే! ఆఖరికి నీప్రాణం మీదికే వొచ్చింది!

రాజ్యం : ఏంటో! మాయదారి టైఫాయిడు జ్వరం! మూడు వారాలు పొక్కిపోసింది. మూడు వారాల్లో తగ్గిపోతుందనే అన్నారు. దిగజారలేదు సరికదా మళ్లా తిరగబెట్టేసింది. మళ్లా మరో మూడువారాలు! డబుల్ టైపార్టీ అన్నారు! మారుతోడన్నా లేదు! నన్ను ఆస్పత్రిలో పెట్టి పాపం మీరొక్కరూ పిల్లల్తో యాతనపడ్డారు.

వెంకటప్పయ్య : మామంచిదానవే! పత్యంపెట్టి ఇంకా వారం రోజులన్నా కాలేదు! మనసులో ఎలాంటి దిగులూ - ఆలోచనా పెట్టుకోకు!

రాజ్యం : అదేమన్న మాటలెండి. నాజబ్బుకి ఎక్కణ్ణించి తెచ్చారో ఎంత అయిందో ఇప్పటికీ నాకు చెప్పకుండా ఉన్నారు! అదే ఆలోచించుకోవాలి.

వెంకటప్పయ్య : ఆ ఊసు నిన్నెత్తొద్దన్నానా? ముందు నీ ఆరోగ్యం చూసుకో. నువ్వేమీ లోభపడకు. కావలిసినంత ఓవల్టిన్ను తాగు. తెచ్చిన పళ్లన్నీ తినెయ్యి. పిల్లలకి కూడా పెట్టకు.

రాజ్యం : తినకేం చేస్తున్నాను! కాళ్లు జాపుకుని మీచేత వొండించుకుని మరీ తింటున్నాను. ఆస్పత్రిలో ఉండి సేవ చేయించుకున్నాను. ఇంటికొచ్చీ చేయించుకోబోతున్నాను! ఏదైనా అప్పేకదా! మనకింకో విధం ఉంది కనకనా?

వెంకటప్పయ్య : ఇదిగో! ఆఊసు ఎత్తొద్దన్నానా? ధర్మాసుపత్రిలోనే కదా నిన్ను పెట్టేను! ఆడాక్టరు అశ్వినీదేవతలాగా కాణీ పుచ్చుకోకుండా కాపాడుకొచ్చేడు. మందులకీ మాకులకీ, ఇంటికీ ఆస్పత్రికీ, ఆఫీసుకీ తిరుగుడికీ హైరానాకి అయిందేదో అయింది.

రాజ్యం : మీరు చెప్పకపోయినా ఆమాత్రం నాకు తెలీదు? తలకి మించిన ఖర్చే అయి ఉంటుంది. రెణ్ణెళ్ల బట్టీ అవస్థ పడుతున్నారు. నాకు తెలీదా? సరేలెండి. ఆఊసు ఎత్తను. తీర్చుకుందాం తాపీగా. కూడికకి ఏముంది? నాచేతిలోనే ఉంది!

వెంకటప్పయ్య : సరేలే - అలాగే చేతువుకాని. ఇంక మాటాడకు. నీర్సం వస్తుంది. కళ్లు మూసుకుని పడుకో. నేనూ ఒళ్లు కడుక్కుని బట్టలు మార్చుకు వస్తాను.

(ఆడగొంతుతో తోడిరాగం ఆలాపనతో 'కద్దనువారికి' కీర్తన సన్నగా దూరం నుండి వినిపిస్తూ

మధ్యమధ్య దాగ్గరవుతూ గట్టిగా వినిపిస్తూ తిరిగి మళ్లీ దూరం అవుతూ ఉంటుంది)

వెంకటప్పయ్య : అదేంటీ! అలా ఉందేమిటి? ఇప్పటిదాకా మాట్లాడుతూనే ఉందే! కాళ్లూచేతులూ కడుక్కువచ్చేలోగా దీనికి ఏమైందీ? నిద్రా! ఒంటిమీద స్పృహ లేనట్టు పడి ఉన్నాది! బాబోయి నాక్కాళ్లూ చేతులూ ఆడ్డం లేదు. అదిగో పెదిమలు కదుపుతోంది - ఏమన్నా మాటలంటున్నాదా! వొసే రాజ్యం! రాజ్యం! వొసేరాజ్యం

(గొంతునిండా ఆదుర్దా - కంగారూ ఉంటాయి)

(తోడి రాగాలాపన బాగా వినిపిస్తూ ఉంటుంది. దాంతోపాటు వసారాలోంచి పిల్లల గోలా - కొట్టుకోవడాలు అరుపులు - కాకిగోలా వినిపిస్తాయి)

పిల్లలు : నన్ను ఎందుకు తోసావ్? అమ్మొచ్చేసింది. అమ్మకి చెపుతానుండు. నువ్వే ముందు నన్ను తోసేవ్! నేనూ చెప్తాను అమ్మకి.

వెంకటప్పయ్య : వెధవాయిల్లారా! ఏవిటా అల్లరి! ముయ్యండి నోరు. మీరూ మీకాకి గోలాను. వచ్చేనంటే చితకబాదేస్తాను. ఆ (గట్టిగా అరుస్తాడు)

రాజ్యం : అబ్బ! తుల్లిపడ్డానండీ! పిడుగుపడ్డట్టు పిల్లలమీద అలాగ విరుచుకు పడుతున్నారేం?

వెంకటప్పయ్య : ముందు నీవొంట్లో ఎలాగుందో చెప్పు. (గొంతునిండా ఆత్రుతా - ఆదుర్దా)

రాజ్యం : వాళ్లనెందుకలా కసిరారు?

వెంకటప్పయ్య : కసిరితే కసిరాను. ముందు నీవొంట్లో ఎలాగుందో చెప్పు.

రాజ్యం : నిక్షేపంలాగుంది. ఇప్పుడేమొచ్చిందనీ?

వెంకటప్పయ్య : పిలిస్తే పలికేవామరి?

రాజ్యం : పిలిచారా?

వెంకటప్పయ్య : పిలవలేదామరి?

రాజ్యం : అలాగనా! (నవ్వుతుంది)

వెంకటప్పయ్య : ఏవిటా నవ్వు!

(నెమ్మదిగా తనలో తాను - ఎలాంటి మనిషి ఎలా అయిపోయింది. ఆచక్కతనం ఏదీ? నవ్వు మొహమూ భయం వేసేటట్టు అయిపోయింది. కళ్లుగుడ్లగూబ కళ్లలా అయిపోయాయి. పళ్లూ ముందుకు పొడుచుకువచ్చేశాయి. ఎలా తేరుకుంటుందో ఏమిటో?)

రాజ్యం : వొళ్లు మరిచిపోయానండీ. మరేం లేదు.

వెంకటప్పయ్య : అంతేకదా.

రాజ్యం : మీకు పక్క బెదురు ఇంకాపోలేదు. ఇంకేం భయం లేదండీ. బెంగ పెట్టుకోకండి. పత్యం తిని ఇంటికి వచ్చేసేను కదా! అందులోనూ

కొత్త ఇంటికి!

వెంకటప్పయ్య : నువ్వదోలా పడి ఉంటే నాపై[ప్రాణాలు పైకి పోయాయి. బెంగపడొద్దూ అంటున్నావు! ఎక్కడన్నా నీఒంటిని కండ ఉందా? ఒక్కసారి నీవొంటిని నువ్వే చూసుకో - ఎమికల మీద తోలు మాత్రమే ఉంది!

రాజ్యం : నావొంట్లో హాయిగా ఉంది. తింటున్నది అరుగుతున్నాది. నిద్రపడుతున్నాది. అంత జబ్బుపడ్డాక నిలుచున్న పాళంగా మామ్మూలు మనిషిని కమ్మంటే అవుతానా?

వెంకటప్పయ్య : నువ్వు పరధ్యానంగా ఉంటే గుండెలార్చుకుపోయేయి. నువ్వు నిద్రపోతున్నా నాకు భయమే. నవ్వకు! నీకేం తెల్సు! నీ కడుపు కిందకీ మీదకీ ఊపిరికి ఎగురుతూ ఉంటే అమ్మయ్య అనుకుంటాను.

రాజ్యం : మీరు బొత్తిగా భయస్థులండీ. నాకేం కాలేదు కదా! ఇంటికొచ్చేసేను కదా! మనస్సు ఎటోపోయింది. అంతే! నావొంట్లో మరేం లేదు. ఈ ఇంటికి మారేం కదా! నాకు హాయిగా ఉంది!

వెంకటప్పయ్య : ఈఇంటికి వచ్చిందగ్గర్నుంచీ నాకూ హాయిగానే ఉంది. సరే ఉండు. తలదువ్వుకుని ఓసారి అలా వీధిలోకి వెళ్లొస్తాను.

(ఆడగొంతుతో కామవర్ధనీ రాగాలాపన - నిన్నేనెరనమ్మినాను రామా! దూరం నుంచి దగ్గరవుతూ దూరం అవుతూ దగ్గరగా వినిపిస్తూ వుంటుంది. సంభాషణల మధ్య ఆగకుండా ఈకీర్తన అలా వినిపిస్తూనే ఉంటుంది)

వెంకటప్పయ్య : రాజ్యం! (నెమ్మదిగా పిలుస్తాడు.) కళ్లుమూసుకుని ఉందే! ఓహో ఇదిమళ్లీ ఏదో లోకాల్లో విహరించడానికెళ్లింది. ఏ చిన్ననాటి మధుర సన్నివేశాల్నో జ్ఞాపకానికి తెచ్చుకుంటోంది కాబోలు! భయ పడాల్సింది లేదు. పీక్కుపోయి వికారంగా తయారైన మొహంలో ఎంత సంతోషమో! పెళ్లైన కొత్తల్లో దీనిమొహంలో ఇలాగే సంతోషం తాండవిస్తూ ఉండేది! అరే నోరు తెరిచిందే! ఓపక్కకి తలవంచి ఆడిస్తోందే! అన్నీ తమాషా చేష్టలే! అహహహ! అహహహ! (పకాలున నవ్వుతాడు. ఆనవ్వు దొంతరలు దొంతరులుగా అలా నవ్వుతూనే ఉంటాడు.)

రాజ్యం : అబ్బ! ఎందుకూ ఆ విరగబాటు నవ్వు!

వెంకటప్పయ్య : అహహ అహహ! ఏదీ మళ్లీ కళ్లుమూసుకుని నోరు సాగదీసి మెడవొంచి పక్కకి ఆడించు. చూస్తాను!

రాజ్యం : అదా! ఎదురింటి పిల్ల పాడుతోంది. వినండి.

వెంకటప్పయ్య : ఓహో! ఇక్కడ సంగీతం వినపడుతున్నాదే! నువ్వు చెప్పేంత వరకూ చెవుల్లో ఏదో గుయ్యిగుయ్యిమంటున్నా అది సంగీతం అని నాకు

తెలియేలేదు! అదియాసంగతి! చిన్నప్పుడు నువ్వు చిన్న వాయులీన విద్వాంసురాలివి కదూ! మరిచిపోయాను.

రాజ్యం : అది కామవర్ధనీ రాగం. ఈగదిలోకి గాలి పువ్వువెలగవాసననీ కామవర్ధనీరాగాన్నీ మోసుకువస్తోంది. ఎంత కంపిస్తూ మత్తెక్కిస్తోందో!

వెంకటప్పయ్య : ఇది వెలగపండు పువ్వువాసనా?

రాజ్యం : అయ్యోరామా! వెలగపండు కాదండీ! పువ్వువెలగ. మనపెరట్లోంచే వస్తోంది! మీరు ఎప్పుడూ పువ్వువెలగని చూడలేదా? తెల్లటిపువ్వులు! మత్తెక్కించే కమ్మటి వాసన! ఈకొత్తింట్లో మొక్కలన్నిటినీ మీరు చూడేలేదా!

వెంకటప్పయ్య : చూస్తాలే! చూస్తాలే! ఏమర్రోయి పిల్లలూ! ఇక్కడ సంగీత కచేరీ అవుతున్నాది. వచ్చి చెవిలోపోసుకోండి. పువ్వువెలగ వాసన వస్తోంది! ముక్కుకి పట్టించుకోండి! (పిల్లలు పరిగెట్టుకు వచ్చిన ధ్వని)

రాజ్యం : మీనాన్నకి ఎగతాళీగా ఉంది! ఒరేబాబూ ఎదిరింటి అమ్మాయి పాడుతోంది. వినండి. ఇక్కడ కన్నా వీధి వరండాలోకి ఇంకా బాగా వినపడుతుంది. వెళ్లివినండి.

(పిల్లలు వీధి వరండాకి పరిగెట్టినట్లు ధ్వని, కీర్తన వినిపిస్తూ ఉంటుంది.)

వెంకటప్పయ్య : ఈ ఇంట్లో సుఖంగా ఉందనుకున్నాను. కాని ఈపార్శ్వశూల తప్పదు లాగుంది!

రాజ్యం : శొంఠికొమ్ము తెచ్చుకోండి, అవునూ, చీకటి పడుతూ ఉంటే ఇప్పుడెందుకూ వీధిలోకి? పెందరాళే పిల్లలకి అన్నం పెట్టి మీరూ తినకూడదూ?

వెంకటప్పయ్య : అనుకుంటూ ఉండగా ఆలస్యమైపోతున్నాది! ఇల్లాగ్గా ఇహనెళ్లి పాపపరిహారార్థం ఇక మంచి పని చెయ్యాలి.

రాజ్యం : పాపాలు కూడా చేస్తున్నారా?

వెంకటప్పటయ్య: పాపం చెయ్యందీ బతుకువెళ్లలేదు.

(పిల్లలిద్దరూ పరిగెట్టుకు లోపలకి వచ్చిన ధ్వని)

పిల్లలు : అమ్మా! అమ్మా! పాట బాగుందమ్మా! ఎలా పాడుతోందో!

వెంకటప్పయ్య : ఓహో! మీరు మీ అమ్మకి పిల్లలే! చిన్నవాళ్లైనా సరిగమలసాంబారు మీకు నచ్చినట్టుందే!

రాజ్యం : సంగీతానికి చిన్నేమిటి పెద్దేమిటి! అందరికీ ఆనందాన్నిస్తుంది. పిల్లలు లయకి ఉల్లాసంతో ఊగుతారు.

వెంకటప్పయ్య : సరేసరే! ఒప్పుకున్నాం - ఒప్పుకున్నాం. నేను వీధిలోకి వెళ్లొస్తా.

(వెళ్లినట్టు దగ్గర్నుంచి దూరానికి అడుగులచప్పుడు)

పిల్లలు : అమ్మా! వసారాలో మేం ఆడుకుంటాం

రాజ్యం : సరే-చూడు ఆ స్విచ్చి-ట్యూబులైటుది. నొక్కు-ఊ వెలిగింది. సరి ఇహ వెళ్లి ఆడుకోండి. దెబ్బలాడుకోకండి. (పిల్లలు వెళ్లిపోయిన ధ్వని) ఈ ట్యూబువెలుగు చల్లగా ఎంత బాగుందో! ఆపాత గూభ్యం కొంపలో బూజుపట్టిన బల్బుకీ దీనికీ పోలికెక్కడా! అక్కడ తగిలించే బల్బు అస్తస్తమానమూ ఫ్యూజు అయిపోవడమే! నా సంగీతంలాగ! ఊ! రెండ్రోజులు వెలిగి ఫ్యూజు అయిపోయింది! ఇప్పుడు ఫిడేలూ లేదు. కమానూ లేదు. ఆరేళ్ల క్రితానికీ ఇప్పటికీ ఎంత తేడా!

(విరామ సంగీతంతో ఫ్లాష్ బేక్)

(రాజ్యం నవ్వు కిలకిలా కిలకిలా వినిపిస్తుంది.)

ఆడగొంతు : రాజ్యం! వొసేయి రాజ్యం! ఏవిటా నవ్వు! పెళ్లికావల్సిన పిల్లవి! ఇరవై నాలుగ్గంటలూ నవ్వే! రేపొద్దున్న అత్తారింట్లోనూ ఇలాగే కికీ అని నవ్వుతావు కాబోలు!

రాజ్యం : నవ్వితేనవ్వుతాను! ఏంనవ్వకూడదా! నవ్వే నామొహానికి అందం (పాటలా ఆఖరి వాక్యం ఉంటుంది)

ఆడగొంతు : అలా విరగబడకపోతే ఆ సంగీతం ఏదో పాడుకోకూడదూ! ఆఫిడేలు వాయించుకోకూడదూ. నాలుగేళ్లాయి నేర్చుకుంటున్నావ్! నిన్ను చూసుకోవడానికి పెళ్లివారు వస్తున్నారు! పెళ్లిచూపులప్పుడు ఏ కీర్తన పాడతావో! సంగీతం మాస్టారిచేత మరోసారి చెప్పించుకో.

రాజ్యం : నేనేం మాస్టారి దగ్గర మరోసారి చెప్పించుకోనక్కర్లేదు. పాడతాలే! తోడిరాగం నాకిష్టం! తోడి కీర్తనే.

ఆడగొంతు : తోడో తాడో ఏదో ఒహటి! నువ్వూ నీసంగీతప్పాటా వచ్చిన పెళ్లికొడుక్కీ వాళ్లకి నచ్చితే అంతేచాలు! నేర్పించినందుకు సార్థకం అవుతుంది.

రాజ్యం : ఏంటో! తాడు ఏమిటమ్మా! నాకు సంగీతం నేర్పిస్తున్నారే కాని ఇంట్లో ఎవరికీ ఏమీ తెలీదు! పెళ్ళి కీర్తనే పాడతానులే. పల్లవి గోపాల అయ్యర్ కీర్తన 'అంబనాదు విన్నపము విని' పాడతాను.

బయటనుంచి

మగగొంతు : అమ్మా రాజ్యం! నువ్వు అదృష్టవంతురాలివి! పెళ్లికొడుకు ఆంధ్రవిశ్వ కళాపరిషత్తు పట్టభద్రుడు!

ఆడగొంతు : అబ్బాయి పేరేవిటన్నారూ?

మగగొంతు : వెంకటప్పయ్య!

ఆడగొంతు : వెంకటప్పయ్యా?

మగగొంతు : వెంకటప్పయ్యా అని అంటున్నావ్! అతడేం అల్లాటప్పయ్య కాదు! చెన్నారాష్ట్ర ప్రభుత్వంలో ఎల్.డి.సి. డెబ్భైరెండు రూపాయలు జీతం! (నేపథ్యంలో పెళ్ళి వారొచ్చేసారూ... పెళ్ళివారొచ్చేసారూ...)

రాజ్యం తండ్రి : రండి. రండి. రండి. కూర్చోండి.

వరుడి తండ్రి : అమ్మాయిని తీసుకురండి

రాజ్యం తండ్రి : అలాగే...

వరుడి తండ్రి : వెంకటప్పయ్యా! అమ్మాయిని చూడు.

వరుడి తల్లి : అమ్మాయ్, నీకు సంగీతమొచ్చా?

రాజ్యం తల్లి : నాలుగేళ్ళ బట్టి నేర్చుకుంటోంది.

వరుడి తల్లి : నోటి పాటా?

రాజ్యం తల్లి : ఫిడేలూ నేర్చుకుంది. నోటిపాటా నేర్చుకుంది. వాయించమంటారా?

వరుడి తల్లి : వాయించడం ఒద్దులెండి. ఏదమ్మా ఒక పాట పాడు.

రాజ్యం : (పాడుతుంది) 'అంబనాదు విన్నపము విని' (అపశృతితో పాడుతుంది.)

మధ్యవర్తి : శభాష్.. శభాష్.. ఎంత బాగా పాడిందో. ఏమోయ్ వెంకటప్పయ్యా, పెళ్ళాడబోయే పిల్ల సంగీతజ్ఞురాలు. ఇవ్వింక ఉద్యోగం చేయనక్కర లేదు.

రాజ్యం : హిహిహి (నవ్వు)

పెళ్లిచూపులవారు : వస్తామండి. వెళ్లొస్తామండి.

(విరామ సంగీతం)

ఆడగొంతు : ఏవిటీ ఆవిరగబాటు తనం. వాళ్లు మంచివాళ్లు కాబట్టి సరిపోయింది! ఆ కిస్సుకిస్సు నవ్వు! బుద్ధీజ్ఞానం లేదు!

రాజ్యం : నవ్వకేం చెయ్యమన్నావే! ఎంతో బాగాపాడదాననుకున్నాను. గొంతు అలా సద్దుకుని కీర్తన పూర్తిగా పాడేనా! తాళం తప్పయిపోయింది! ఉసిలోకి రావాలా? అది కాస్తా వేలుమీది కొచ్చింది! నాకు ఏడుపొచ్చేసింది. ఓపక్క సరిగ్గా పాడలేకపోయానని చస్తూ ఉంటే వాళ్లు నాపాటకి సెహబాసు అన్నారు! వాళ్లకి శృతీ అపశృతీ తెలీనే తెలీదు. రాగతాళ జ్ఞానం లేనే లేదు. మళ్లా పెద్దవాళ్లు! సంగీతం గురించి ఏం తెలీదు. తెలివితక్కు వాళ్లు! పైగా ఆయనెవడో వెంకటప్పయ్య ఉద్యోగం చెయ్యక్కర్లేదు అంటాడు! నవ్వకేం చెయ్యనూ? (కిస్సు కిస్సు నవ్వు)

ఆడగొంతు : పోనీలే! నీతప్పులు ఏవిటో వాళ్లకి తెలీలేదు! మంచిదే కదా! సంబంధం కుదరడం ముఖ్యం! సంగీతానికేముంది!

(క్షణకాలం విరామ సంగీతం)

మరో ఆడగొంతు : ఏవే రాజ్యం! అప్పుడే ముగ్గురు కొడుకుల తల్లివైపోయావ్ పాటని అటకెక్కించేసేవా? వాయులీనాన్ని వాయిస్తున్నావా?

రాజ్యం : నామొహం! పాటా? ఫిడేలా? కొత్తల్లో పేరంటాలకెళ్లినప్పుడు ఏంపాడేనో! మా ఆయన ఒక్కనాడూ ముచ్చటకైనా పాడు అనలేదు. నేపాడనూ లేదు! ఏడాది తిరక్కుండా పెద్దవాడు పుట్టేసేడు-ఇదే వరసే-మరో ఇద్దరు-సంసారమే సంసారం! వాయులీనం వాయువులో కలిసి పోయింది!!

(పిల్లలగోలా అల్లరి - పిల్లలు "కద్దనువారు, వద్దనువారు" అంటూ గట్టిగా పాటలా అరుస్తూ గోలచేస్తున్నారు.)

రాజ్యం : ఒరేయి! ఇలారండి! ఎందుకలా కుస్తీలు పట్టి దెబ్బలాడుకుంటున్నారు!

(పిల్లలు వచ్చినట్టు ధ్వని)

రాజ్యం : తమ్ముడు నిద్రపోతున్నాడా?

పిల్లలు : గుర్రుపెడుతున్నాడు!

రాజ్యం : అల్లరి చేస్తే లేచిపోడూ?

(పిల్లలు నవ్వుతారు)

రాజ్యం : ఇంక చాలు ఆటలు. ఎదురింటి అమ్మాయి హాయిగా పాడుతున్నాది. కూచుని చక్కగా వినండి.

(ఎదురింటి నుంచి కళ్యాణి రాగంలో 'నీదుచరణ పంకజములే గతియని' పల్లవి గోపాల అయ్యర్ కీర్తనకి స్వరకల్పన వినిపిస్తూ వుంటుంది.
గాత్రం తారస్థాయికి లేపి గాంధారంలో నిలుపుతూ కల్పన సాగుతూ ఉంటుంది.)

అమ్మాయి గొంతు : గమపదని ఓ జగజ్జననీ

అబ్బాయి వెక్కిరింత

గొంతు అపశృతితో: సరిసనిపదని ఓ జగజ్జననీ!

(తంబూరా శృతీ పాటా ఆగిపోతాయి.)

అమ్మాయి : వెధవా! సంగీతం నేర్చుకోమంటే రావు కాని అల్లరికి సిద్ధం!

అబ్బాయి : నేను సరిగా స్వరం వెయ్యలేదూ?

అమ్మాయి : నాన్నరానీ చెపతాను.

అబ్బాయి : దానిపనిసరి సానిదాని పనీ ఓ జగజ్జననీ

అమ్మాయి : నాన్న రానీ వెధవా!

(అమ్మాయి అబ్బాయి మాటలూపాటలూ రెండూ ఆగిపోతాయి.)

రాజ్యం : కొంచెంసేపైనా ప్రాణంహాయిగా ఉంది! ఇహనైంది సంగీతం!

పిల్లాడు : ఇంక పాడదేంటమ్మా?

రాజ్యం : అదిగో మీలాంటి అల్లరికుర్రాడు వొచ్చి కంగాళీ చేస్తే కోపంవచ్చి మానేసింది.

పిల్లడు : ఆ కుర్రాడూ సరిగమా అని బానే పాడేడు కదమ్మా?

రాజ్యం : సరిగమా అని సరిగ్గానే అంటున్నాడు. కాని తప్పుపాడుతున్నాడు. రోజూ వింటూ ఉంటాడు కదా! సరిగమా స్వరాలు సరిగ్గానే పట్టుకున్నాడు. వాతావరణంలో సంగీతం ఉంటే వాసాలు కూడా పాడతాయి.

పిల్లడు : ఆఅమ్మాయి ఎలాగమ్మా పాడుతున్నాదీ!

రాజ్యం : నేర్చుకుని పాడుతున్నాది.

పిల్లడు : నువ్వు పాడతావూ?

రాజ్యం : ఓ పాడతాను. నీకు చెప్పమన్నావా?

పిల్లడు : ఛీ మొగాళ్లు పాడరు.

రాజ్యం : మొగాళ్లూ పాడతారమ్మా! నీకు చెప్పమన్నావా?

పిల్లడు : ఏదీ చెప్పు.

రాజ్యం : తరువాత చెప్తాను. ఒరే బాబూ కాళ్లు లాగుతున్నాయి. కాస్త పట్టు.

పిల్లడు : పట్టను. కాళ్లమీద గుద్దుతాను.

రెండోపిల్లడు : నేను చేతులమీద గుద్దుతాను.

(పిల్లలు కాళ్లమీద చేతులమీద గుద్దుతున్నట్టు సన్నటి చప్పుడు)

(రాజ్యం కళ్యాణి రాగంలో 'నీదుచరణపంకజములే గతియని' నోట్లో నోట్లో సన్నగా పాడుతూ ఉంటుంది. ఓ సంగతి పాడి రెండో సంగతి కుదరక మరోసంగతి అనబోయి గజబిజిగా పాడుతుంది.)

పిల్లడు : నువ్వా పిల్లలా పాడ్డం లేదు!

రాజ్యం : అంతా మరిచిపోయానురా!

(సిబ్బి పడిన చప్పుడు)

రాజ్యం : కుక్కకాబోలు! కొట్టండి. కొట్టండి. గూట్లో అన్నం మండపెట్టింది కాబోలు!

(పిల్లలు పరిగెట్టిన చప్పుడు)

పిల్లడు : కుక్కకాదమ్మా! పిల్లి. అన్నంగిన్నెమీద సిబ్బి తిరగతోసింది.

రాజ్యం : నయమే! మళ్లీ వండుకోకుండా! కుక్కముట్టుకున్న కూడూ తినాల్సిన రోజులు! తలుపులు గడియపెట్టి రావొద్దూ?

పిల్లడు : నువ్వే ఇక్కడికి వచ్చి సంగీతం వినమన్నావు.

రాజ్యం : ఔనమ్మా! నేనే మిమ్మల్ని రమ్మన్నాను. కాని తలుపులు వేసి రావాలి తెలిసిందా?

వెంకటప్పయ్య గొంతు : వెన్నలా బాగుంది. పువ్వువెలగవాసనా బాగుంది. రెండూ మహా బాగున్నాయి.

(దూరం నుంచి దగ్గరవుతూ)

రాజ్యం : అప్పుడే వచ్చేశారేం?

వెంకటప్పయ్య : పనైపోయింది!

రాజ్యం : పాప పరిహారం అయిందా?

వెంకటప్పయ్య : కొంచెం అయింది.

రాజ్యం : ఈమధ్య ఎక్కడికో వెళ్లేరు కాబోలు!

వెంకటప్పయ్య : రామరామ!

రాజ్యం : మీ మాటలు, వాళకం అలాగుంది.

వెంకటప్పయ్య : ఛీఛీ

రాజ్యం : ఆమాట అననులెండి. ఆ చంక కింద పేపరు చుట్టబెట్టి ఏం తెచ్చారూ? ఏమిటదీ?

వెంకటప్పయ్య : విప్పి చూపిస్తాను కదా!

(కాయితం విప్పిన చప్పుడు)

రాజ్యం : ఓహో చీరా! నాలుగువేళ్ల వెడల్పు అంచు జరీ ఉందే! జరీచీర. ఎంత బాగుందో! చీరరంగుకి సరిపడ్డ జరీ అంచు రవికల గుడ్డా ఉందే! ఏంటి కొన్నారా?

వెంకటప్పయ్య : కొన్నాను. ఉన్నడబ్బు కాస్తా అయిపోకుండా కొనేసాను.

రాజ్యం : డబ్బెక్కడిదీ!

వెంకటప్పయ్య : చెపితే నువ్వు క్షమించవు.

రాజ్యం : ఏం చేశారండీ?

వెంకటప్పయ్య : ఏమీ అనని చేతిలో చెయ్యి వెయ్యి.

రాజ్యం : అలాగే-ఇదిగో చేతిలో చెయ్యి వేస్తున్నాను. ఏవిటో చెప్పండి. ఏవిటీ అలాగ వొణికిపోతున్నారేం? ఏంచేశారండీ! దొంగతనం కాని చెయ్యి లేదు కదా!

వెంకటప్పయ్య : అంతకన్నా హీనమైనదే! నీకు టైఫాయిడు మళ్లా తిరగబెట్టింది కదూ! నాకు ఆశలన్నీ ఉడిగిపోయాయి. స్నేహితుడు పాపం వాడొకడు ఇంటికి వచ్చాడు. చూసీచూడ్డంతో సలహా ఇచ్చాడు. తెగించి వాడికిచ్చేశాను.

రాజ్యం : ఏమిటిచ్చేశారు?

వెంకటప్పయ్య : నీకింకా అర్థం కాలేదు. వాడే పట్టుకెళ్లి రెండు వందల ఏభైకి అమ్మేశాడు. అంత డబ్బు వస్తుందని కలలో కూడా అనుకోలేదు. పాతదనుకున్నాను. పాతదానికే విలువ ఎక్కువట. ఇహనువ్వు దానికోసం గదినాలుగు పక్కలా చూడక్కర్లేదు. లేదు.

రాజ్యం : వెళ్లిపోయిందా?

వెంకటప్పయ్య : నీకు కష్టంగా ఉంటుందని తెలుసు. నేను చేసింది తప్పే! (బాధతో అంటాడు)

రాజ్యం : (బాధని తమాయించుకుంటున్న గొంతుతో) ఏ తప్పూ చెయ్యలేదు. ఏ సంసారైనా అదే చేస్తాడు. చెయ్యవలసివచ్చి చేశారు. మీరేం తినేశారా?

వెంకటప్పయ్య : మనకంతా మగపిల్లలే కదా అని ధైర్యం చేశాను!

రాజ్యం : పోనీయ్యండి. నానోరు ఏనాడో నొక్కుకుపోయింది. ఇహనాఫిడేలు ఉండి నన్ను రక్షిస్తుందా? సరస్వతీ కటాక్షం నాకంతే ఉంది. తల్లివెళ్లి పోయింది. వెళ్లిపోతూ తల్లి తల్లిగుణాన్ని చూపించుకుంది. నాకు ప్రాణంపోసింది. వెళ్లిపోతూ నాకో చీరా-రవికల గుడ్డా పెట్టింది. (ఏడుపు నిండిన గొంతుతో ఆఖరి వాక్యాలు అంటుంది)

వెంకటప్పయ్య : నాలుగు కాలాలపాటు ఉంటుంది కదా అని చుట్టుజరీ చీర కొనేశాను.

రాజ్యం : జ్ఞాపకంగా ఉంటుంది లెండి.

(లైట్స్ ఆఫ్ )

(కొద్దిమార్పులతో ఆకాశవాణి హైదరబాద్ నుండి ప్రసారితం)

కథప్రచురణ : 1952-భారతి

........................................................................................................................

# కుంకుడాకు

## నాటిక

ఎడంవేపునుండి మేష్టరు - కుడివేపు నుండి అప్పలనాయుడూ నడుస్తూ ఎదురవుతారు.

మేష్టరు : ఏంవోయి నాయుడూ!

అప్పలనాయుడు: మేస్ట్రుగోరా! దండాలండి

మేష్టరు : సంతనుంచా?

అప్పలనాయుడు: మరేనండి, సంతనుంచే

మేష్టరు : నీబొట్టి ఈమధ్య పొలం గట్లంట కనపట్టం లేదే!

అప్పలనాయుడు: పారా? అది వాళ్ల బాప్పకాడికెళ్లినాదండి.ఇయేళ తిరిగొస్తాది.

మేష్టరు : పొలాలంటా, పెండిలంటా పొద్దస్తమానం ఆగమ్మకాకిలాగ తిరుగుతూ కనపడుతున్నాది. దాన్ని బడికి పంపవయ్యా! నాలుగు అక్షరం ముక్కలూ లెక్కలూ నేర్చుకుంటుందీ.

అప్పలనాయుడు: మాసెల్లీ అనాగే అంటున్నాదండి. ఓరన్నా! దాన్ని బళ్లో ఎయ్యరా అని! పారంటే మాగారం అండి. ఇదిగో ఆళ్లిద్దరూ ఇయేళొ స్తున్నారని పులుసునోకి మునేళం ఇగురికి చందువాలు పట్టుకొస్తన్నా. మాఇంటాడది ఒహటే గోలెట్టి సంతకి నన్ను తోలినాది.

మేష్టరు : గారం సరేనయ్యా! ఎవరు చెయ్యరు పిల్లల్ని గారం! ఈవయసులోనే నేర్పాలి కుదురుగా ఉండడం. కాస్తబుద్ధీ జ్ఞానమూను.

అప్పలనాయుడు: నానూ అనాగే అనుకుంటున్నాను మేస్ట్రుగోరూ! బొట్టి బళ్లో మీకాడన్నా కుదురుగా కూకుంటే అదేశాన.

మేష్టరు : నాయుడూ, మంగళారం మంచిరోజు.

అప్పలనాయుడు: అయేళ నుండీ అంపుతాను లెండి.

మేష్టరు : నా కంటికి సరిగా ఆనటం లేదు. వాడెవడు కాళ్లీడ్చుకుంటూ ఇటే వస్తున్నాడూ?

అప్పలనాయుడు: ఆడా? చినదేముడు. ఆడికి ఈపొద్దు కూలిదొరికినట్టు నేదు. మొగం ఏలాడేసుకువొస్తున్నాడు. మరి నానెళ్లొస్తా మేస్ట్రుబాబూ!

మేష్టరు : మంచిది. మంగళారం బొట్టిని పంపు. మానీకు (నాయుడు నిష్క్రమణ)

చినదేముడు : దండాలు మేస్ట్రుబావూ!

మేష్టరు : దండాలు. అలా ఉన్నావేం!

చినదేముడు : కాళ్లరిగేటట్టు తిరిగినాను బావూ! ఎక్కడా కూలి పుట్టనేదు. గుడిసెకి పోతన్నా.

మేష్టరు : పంతులుగారి దొడ్లో మొక్కలకి గొప్పులు తవ్వి అరటి బోదెలకీ, పాదులకీ పాడి కట్టాలంట. రేపొద్దున్నే వెళ్లు. ఆయన కూలోడి కోసం చూస్తున్నారు.

చినదేముడు : బాబ్బాబు! మాసల్లటిమాట సెవినేసినారు. తెల్లారి లెగిసీ లెగ్గానే నానొస్తానని ఆరికి సెప్పండి మరెవురికీ ఒప్పసెప్పకండి. మీకు పున్నె ముంటాది.

మేష్టరు : అది సరే గానీ ఒరే - నీ బొట్టికెన్నేళ్లూ?

చినదేముడు : ఎవులూ? మాబొట్టి గవిరిగుంటకా? ఈఅమాశెకి ఎనిమిదో ఏడొచ్చినాది.

మేష్టరు : అయితే అప్పలనాయుడి బొట్టీ నీ బొట్టీ ఒక్కడువాళ్లే. అప్పలనాయుడు తన బొట్టి పారమ్మని మంగళారం నుండి బళ్లోకి పంపుతానన్నాడు. నువ్వూ నీ బొట్టిని పంపు.

చినదేముడు : అప్పలనాయుడికేటండి! మోతుబరి రైతు. ఊర్నోకి పెదనాయుడు. మావూ? కూలీ నాలీ సేసుకుబతికేటోళ్లమి. మాకెందుకండి సదువులు! ఆగుంటదాన్ని బళ్లోకి అంపితే కోనేటికాడి నుండి ఇంటికి అడే నీళ్లు ఎవులు మోస్తారండి? మాయాడదా? అదీ పనీపాటకి ఎల్తాది. మావు కూలిసేసుకువచ్చేతలికి పోయినోకి క(రాకంపా మాగుంట ఏరుకొస్తాది. మాకెందుకండి సదువులు!

మేష్టరు : పిల్లలందరూ చదువుకోవా(లా. చిన్నప్పుడే నాలుగుముక్కలు నేర్వాలి. పెద్దయాక చదువు వంటపట్టదు. లెక్కా డొక్కా రాకపోతే ఎలా బతుకుతా(రా!

చినదేముడు : రెండేళలా సత్తుగిన్నెడు గెంజీ నంచుకోడానికో మిరపకాయ మాకు దొరికితే అదే శాన బావూ!

మేష్టరు : నేను చెప్పాల్సింది నేను చెపుతున్నా. నామాట మీఅందరి చెవికీ ఎక్కితే బాగుపడతారు. ఇద్దరు గుంటలూ కలిసి ఆటాపాటా చదూనేర్చు కుంటారని చెపుతున్నా. సరే, రేపొద్దున్నే పంతులి గారింటికి వెళ్లు.

చినదేముడు : ఎల్లనా! నెగుస్తూనే ఎల్తా, ఆరికి సెప్పడం మర్సిపోకండి. సెలవిప్పించండి బావూ!

(ఇద్దరి ని(ష్కమణ)

(మొదటితెర గుడిసె)

(గవిరి ఏడ్పు - వెక్కుతూ)

గవిరితల్లి : ఓలేడకే! మీయయ్య సిటమో సిటమో వొత్తాడు. ఆదురానీ, గెంజి వోర్చి వొన్నం ఎడ్తాను. సెపుతున్నానా? ఊరుకో - ఏడకు. అదిగో అయ్య! మాటనోనే ఒచ్చేసినాడు. ఏటిమావా! వొట్టిసేతుల్తో ఒచ్చినావు. కూల్దొరకనేదా?

చినదేముడు : ఎవుడిమొహం సూసినానో నెగిసి! కాళ్లరిగేనా తిరిగినాను. ఎక్కిడా ఏటీ దొరకనేదు. గవిరి, ఉండసుట్టుకు అడుకుని ఏడుత్తున్నాది! కొట్టినావేటే!

తల్లి : దాన్ని కొడతానా? నాసేతులడిపోవూ? పెద్దోళ్లం ఆకలి అణుసు కుంటాం. గుంటపాప ఆకలనేడుతున్నాది. నానేటిసెయ్యను! ఏయమ్మ కాడికెళ్లినా ఎడమొహమే! ఏయమ్మో పిడికెడు గింజలు ఎట్టనేదు!

గవిరి : ఆకలేవ్! ఓలమ్మో! ఆకలే! (ఏడ్పు)

తల్లి : ఓలేడకే! ఏడకే!

చినదేముడు : ఏడకే గవిరీ! పంతులుగోరింట గొప్పులు తవ్వేపని తగిలినాది. మేస్త్రుబావు సెప్పినాడు. రేపు కడుపునిండా తిందూగాని. ఏడకు! ఏడకే తల్లీ!

గవిరి : గట్టిగా - మరింత గట్టిగా ఏడస్తుంది.

తల్లి : ఇన్నావుగా! అయ్యరేపు సరుకులుతెత్తాడు. పెందిలకడే నెగిసి తట్టడు కంపలేరుకురా. పెద్దసత్తుగిన్నె నిండా గెంజి పోత్తా. వొరొన్నం మొత్తం అంతా నీకేఎడ్తా. నంచుకోడానికి అయ్య రెయ్యి లొట్టుకొత్తాడు. ఏడకు! ఏడకు. ఇప్పుడేటీనేదు. నానేటిసేతును! కళ్లు మూసుకో - ముడుసుకుని అడుకో- నిద్రఅడతాది. ఏడకే! ఓలేడకే!

(లైట్స్ ఆఫ్)

రెండవతెర (ఉదయపు వేళ)

గవిరి : (ఎడం పక్క నుండి ప్రవేశం. చేతిలో కంపకట్టా తట్టా ఉంటాయి.) నేపథ్యంలోంచి:)

: ఒలే ఒలే గవిరీ! సిటం ఆగవే! నానొత్తున్నా! ఓసిటం నిలుసోయే!

గవిరి : పారమ్మగొంతునాగుందే! ఈమద్దిని అగుపడనేదు. ఎక్కిడికి పోయిందో ఏటో.

నేపథ్యంలోంచి:) : ఒలే ఒలే గవిరీ! ఆగవే! ఓసిటం, నానూ ఒత్తున్నా.

గవిరి : నాతోటి నీకేటే? నానుపెండిలంట కర్రాకంపకి ఎలుతున్నా.

(పారమ్మ చింకి పరికిణీలో ఓచేత్తో ఏదో దోపుకుంటూ రెండో చేత్తో తాటికాయల రెండుచక్రాల బండిని తోసుకుంటూవస్తుంది. దాన్ని చూస్తూ గవిరి ఎక్కడ నిలుచున్నది నిల్చున్నట్టే ఉండిపోతుంది. తట్టని కంపకట్టని కింద పడేస్తుంది. పారమ్మని పారచూస్తూ నిలబడిపోతుంది. పారమ్మ పరికిణీ గావంచా వేపు ఓసారి, పగడాల దండవేపు ఓసారి, దాని చేతులకీ కాళ్లకీ ఉన్న సిల్వరు కడియాల వేపోసారి, దాని ముక్కుకాడనోసారి చూస్తుంది. తన ముక్కుకున్న రాగికాడని అటూ ఇటూ తిప్పుతుంది. తన మెడని చేత్తోరాసుకుంటుంది)

పారమ్మ : ఏటనా నాకాసి పారసూస్తున్నావ్? మాబాప్పొ ఆళ్లూరు ఎల్లొచ్చి నాను. పగడాల దండ మా బాప్పదే. పరికిణీ సూసినావా? పువ్వుల్ది! కూసింతే సినిగినాది! ఎర్రర్ర గావంచా - బాగున్నాయి కదే - కడేలు బాప్పే కొనింది. మాయయ్య సుట్టించమన్నాట్ట. సూడుసెవులకీ ముక్కుకీ బంగారపు కాడలు సుట్టించినాది!

గవిరి : (మాటాడదు. కిందపడేసిన తట్టా, కంపకట్టా పట్టుకుని నడవడం మొదలుపెడుతుంది. పార బండిని బరబర తోసుకుంటూ దాని వెనకాతల పడుతుంది. నాలుగడుగులు నడిచాక ఆగి, పరికిణీలో దోపుకుని వొచ్చిన ఆవకాయబద్దని తీసి పెద్ద చప్పుడుతో చప్పరిస్తూ నాలికపైన పెట్టుకుంటూ, పైకితీస్తూ, లొట్టలు వేస్తూ రెండోచేత్తో బండిని అడ్డదిడ్డంగా తోస్తూ గవిరి వెనకే నడుస్తూ ఉంటుంది. దానిలొట్టలకి గవిరి వెనక్కితిరిగి చూస్తుంది. గవిరి చూడ్డం చూసి)

పారమ్మ : మాసెడ్డ రుసిగా ఉంది.

గవిరి : ఏటి?

పారమ్మ : బెల్లమావకాయ బద్ద.

గవిరి : ఎక్కిడిదీ?

పారమ్మ : మాయయ్యకి బుగతగోరిచ్చినారు. చద్దన్నంలో నంచుకున్న బద్దని కడిగి తెచ్చుకున్నా. అందుకే సిటం ఆగవే అని కేకేసినాను. పరికిణీలో దోపుకొచ్చినాను.

గవిరి : రేత్రి నాను రెయ్యిలు నంచుకున్నాను!

పారమ్మ : ముండాగొప్ప! ఎవిడికీ తెల్దనుకున్నావు గావాల! గింజలు నేక రేత్రి మీరగ్గేసుకోనేదు. మాయయ్యసెప్పినాడు. మీయయ్యకి నిన్న కూల్దొరకనేదు. తాగడానికి దప్పికనేదు! రెయ్యిలు నంచుకుంది! రెయ్యిలు!

(పారమ్మ కిందకీమీదకీ ఆవకాయ బద్ద చేతిని ఎగరేస్తూ ఎత్తిపాడిచింది.)

గవిరి : నిన్నరేత్రి మీకూ కూడునేదు!

పారమ్మ : నిన్నరేత్రి మాకు కూడు నేదూ? ఓసిలమిడీ! ఎవిడుసెప్పినాడు?

మాయమ్మనడుగు. రేత్రి మునేళం సేపలు పులుసు, వొరన్నం తిన్నాం. మాయమ్మగోలెట్టినాదని మాయయ్య సంతకెళ్లి మునేళం సేపలూ, ఇగురికి చందువాలు తెచ్చినాడు.

(బడిగంట శబ్దం)

(గవిరి మొహం చిన్నపోతుంది. మాటకి మాటా చెప్పలేకపోతుంది. తలొంచుకుని గబగబా కళ్లాలవేపు నడుస్తుంది. ఆవకాయబద్ద నాకుతూ తాటికాయల బండి తోసుకుంటూ పారమ్మ దాని వెనకే కళ్లాలవేపు నడుస్తుంది.)

బళ్లో పిల్లల ప్రార్ధన గట్టిగా వినిపిస్తుంది.

మేష్టరుగొంతు: తల్లీ! నిన్ను దలంచి

పిల్లలగొంతు : తల్లీ! నిన్ను దలంచి

(చాలా గట్టిగా)

(మూడవ తెర మొగిలి పెండి)

1)బలుసుతుప్ప - తొండ- చప్పుడు 2) పచ్చగన్నేరు చెట్టు - తోవంతా పచ్చపువ్వులు పారమ్మ భుజం మీదకి బండిని ఎత్తుకుంటుంది. గవిరి తట్టా కంపకట్టా నెత్తిమీదపెట్టుకుంటుంది. పారమ్మ చూసుకోకుండా అడుగు వెయ్యడంతో మొగిలి డొంక కాలుకు గుచ్చుకుంటుంది.

పారమ్మ : అబ్బా! (కాలుపైకెత్తి పాదాన్ని చూసుకుంటూ (బండికింద దబేలున పడేస్తుంది) చేత్తో రాసుకుంటూ ఉంటుంది.

గవిరి : మొగిలిపెండా మరోటా! సూసుకునడొద్దా! పురుగూపుట్రా ఉంటాది. ముళ్లుంటాయి. కళ్లునెత్తినెట్టుకు నడకు. మన తోవంతా ముళ్ల మొగిలి పెండే. పదిలంగా సూసుకు అడుగెయ్యి.

పారమ్మ : నాకు తెల్దేటి! బళ్లో పిల్లల పాటింటూ అడుగేసినా! ఆల్లు సూడు. బళ్లోకూకుని పాడుతున్నారు!

గవిరి : ఆళ్లా! ఆళ్లు ఈతోవంట నడరు. ఆళ్లు ఈవొంకెందుకొత్తారు? ఆళ్లకేటి పని?

పారమ్మ : నాను మంగళారం బడికెళతాను. ఆయేళ మంచిరోజు మేష్టేరు గోరు అంపమన్నారు. మాయయ్య అంపుతానన్నాడు.

గవిరి : ఎందుకూ ముష్టి సదువూ?

పారమ్మ : సదువెందుకా? ఇను! ఇను! ఎనాగ పాడుతున్నారో!

గవిరి : మాయయ్యనీ మేష్టేరుగోరడిగినారు. కూలిసేసుకునేవోళ్లకి సదువెందు కన్నాడు మాయయ్య!

పారమ్మ : అవును. మీయయ్య కూలోడు. మాయయ్య నాయుడు.

(గవిరికళ్లనిండా నీళ్లు. గొంతుకలో ఏడుపు)

(బలుసుతుప్పల్లో నుండి ఊసరవిల్లి పెద్ద చప్పుడు)

పారమ్మ : (దడుసుకుని) ఓలమ్మో! ఏటిదది? ఆసప్పుడు!

గవిరి : అన్నిటికీ బయ్యమే. బలుసుతుప్పనో ఊసరవిల్లి గబగబా పాక్కుంటూ ఎల్లింది. అదీ సప్పుడు. ఆవొంక అడుగెయ్యకు. బలుసు ముళ్లు గుచ్చు కోగలవు!

పారమ్మ : నాకు నువ్వేటీ సెప్పనక్కరనేదు. నాకు తెల్దా? నాకూ తెల్సు.

గవిరి : తెలుసు! తెల్సు! మరిగందుకే ఓలమ్మో అని అరిసినావు! అడిగినావు ఏటిదని!

(పచ్చగన్నీరు చెట్టునిండా పువ్వులు - తోవంతా పువ్వులు రాలి పడి ఉంటాయి) పువ్వుల్ని చూసి పారమ్మ ఆగిపోతుంది. తోస్తున్న బండి కఱ్ఱని కిందపడేస్తుంది. పువ్వులు ఏరుకుంటుంది. తల్లో దోపుకుంటుంది. గవిరీ తట్టాకంపా కిందపడేసి పువ్వులు ఏరుకుంటుంది. ముడిలో తురుము కుంటుంది. ముంతంత ముచ్చట ముడిని చేత్తో తడుముకుంటూ సరిచేసు కుంటుంది గర్వంతో - పారమ్మని తక్కువ చేస్తూ..)

గవిరి : ఓలే పారా! నాకు ముంతంత కొప్పున్నాది! నీబుఱ్ర మీద ఎంట్రుకలే నేవు! పెద్దకొప్పుకే పువ్వులందం!

(పారమ్మ ఎదట వెనక్కి తిరిగి చూపెట్టి రెండుమూడు సార్లు ముందూ వెనకలు గుండ్రంగా తిరుగుతూ గర్వంగా చూపెడుతుంది. పారమ్మ దాని ముడినీ, దాని గర్వాన్ని, పువ్వుల్నీ చూస్తుంది. అయినా అది దాన్ని తక్కువ చెయ్యాలనే గొంతుకతో)

పారమ్మ : కొబ్బిరిపీచు నాగెందుకూ? నాతల సూడు. ఎంతనూన రాసు కున్నానో! నీతలకి నూనేనేదు! (గవిరి చిన్నపోతుంది. నూనేలేని తన బిరుసు వెంట్రుకల్ని అటూ ఇటూ చెవులవేపు సవరించుకుంది. పాపిడికటూ యిటూ వెంట్రుకల్ని సరిచేసుకుంటుంది.)

(బడి పిల్లల ప్రార్ధన - గట్టిగా)

ఓ పిల్లగొంతు : సరస్వతీ!

పిల్లలందరి గొంతు : సరస్వతీ!

పారమ్మ : (వాళ్ల గొంతుకతో గొంతు కలిపి) సరస్వతి!

ఓపిల్లగొంతు : నమస్తుభ్యం

పిల్లలందరి గొంతు : నమస్తుభ్యం

పారమ్మ : నమత్తుబ్బెం!

గవిరి : నువ్వుపాడుకుంటూ కూకో. నాను కంపలేరుకోవాలి. నానుపోతున్నా.

పారమ్మ : ఓలుండవే! ఆళ్లపాట పాడనులే! మనపాటలు పాడుకుందావా? ఒలే ఒలే - కూసంతసేపాగుదామే ఆడుకుందామే!

గవిరి : గట్లమ్మటా పుట్లెమ్మటా ఆటలేటే! ఇంటికాడకాని!

పారమ్మ : పోనీ పాట!

గవిరి : పాటా? పాడమన్నావా? (సందు దొరికిందని సంతోషంతో పారని వెక్కిరిస్తూ పాడుతుంది.)

బులుసు తుప్పాకాడ పారమ్మా!
తొండా మూతిసూసి పారమ్మా!
ఓలమ్మ! ఓలమ్మ! ఓలమ్మో!
ఎర్రమూతి సూసి పారమ్మా!
దడుసుకూ పోయింది పారమ్మా
ఓలమ్మ! ఓలమ్మ ఓలమ్మో!
బలుసుతుప్పా కాడ పారమ్మా!

పారమ్మ : నన్నెక్కిరిస్తావే! ఓసి లమిడీ!

గవిరి : (నవ్వు ఆపుకుంటూ) పాడమని నువ్వే అడిగినావు!

(నాల్గవ తెర - పెసరచేను)

1)పెసర కాయలు - మొక్కలతో సహా 2) కుంకుడుచెట్టు - తోవ - తోవంతా కుంకుడాకులు)

పారమ్మ : పాడమంటే ఎక్కిరిస్తావే! నానేం దడుసుకోనేదు. అడిగినాను అంతే!

గవిరి : పెసరసేను కోతకొచ్చినాదే!

పారమ్మ : హాయి హాయి! ఎన్నిగుత్తులో! పెసరగుత్తులు! పచ్చివి సెడ్డ రుసిగుంటాయి. మొక్కలు పీక్కొస్తా.

గవిరి : ఆళ్లు సూస్తే టెంకిమాడుతుందిలే.

పారమ్మ : సూసినోడెవరు? సూసినా నానప్పలనాయుడి బొట్టిని. ఆళ్ల మొకం ఏటంటారు? నువ్వు గాని మొక్కలు పీకేవో, ఆళ్లుగాని సూసేరో నీటెంకి మాడుతుంది! నువ్వూ కూలోడి బొట్టివి!

(పారమ్మ పెసర మొక్కలు పీకి గుత్తులకాయలు ఒలుచుకుని తింటూ వొస్తుంది. గవిరిమొహం చిన్నపుచ్చుకుని పారమ్మ వేపూ, పెసరగుత్తు వేపూ చూస్తూ నిలబడిపోతుంది. తలమీద తట్టని తీసి చంకని పెట్టుకుంటుంది. పొట్టని రెండో చేత్తో అదిమి పట్టుకుంటుంది. మాటాడకుండా ఇటోసారి అటోసారి కిందకీ మీదక చూస్తుంది. కళ్లు తుడుచుకుంటుంది. ఓసారి పారమ్మ వేపు చూసి నడకసాగిస్తుంది. పెసర గింజలు తింటూ బండికర్రని తోస్తూ పారమ్మ నడుస్తూ దానివెనుక పడుతుంది. కుంకుడు చెట్టు తోవంతా కుంకుడాకులు పడి ఉంటాయి. గవిరి మొహం చేటంతవుతుంది. దాని కళ్లల్లోకి వెలుగు)

గవిరి : బలేబలే ఎన్ని కుంకుడాకులో! మరి ఎటూ ఎల్లనక్కరనేదు. (తట్టకింద పెట్టి కూచుంటుంది.) కుంకుడాకులు దొరికినాయి. సేడ్డ దళాసరి

ఆకులు. మరిబాదనేదు పోయినోకి. ఇయాల్టికివి శాన. (కంపకట్టుతో ఆకుల్ని ఒకదగ్గరికి పోగుగా ముందుకీ వెనక్కీ పక్కలకీ వెళ్లి చేస్తుంది. పోగుపక్క కూచోబడిపోయి - ఒక్కొక్క ఆకునీ చేత్తో తుడుస్తూ తట్టలో కుక్కికుక్కి పెడుతుంది. ఆకులు తట్టనిండా వొస్తాయి)

గవిరి : నాను గుడిసెకి పోతన్నా. కుంకుడాకులొట్టుకుని! నువ్వు తినుకుంటూ కూకుంటావో! పాడుకుంటూ ఆడుకుంటావో! నాను పోతన్నా!

పారమ్మ : (పెసరకాయలు పరికిణీలో దోపుకుంటుంది గవిరి వెంటే నడుస్తుంది) సరస్వతీ సరస్వతీ నమతుబ్బెం - నమతుబ్బెం సరస్వతీ!

గవిరి : గవిరి నెత్తిమీద తట్టపెట్టుకుని కంపకట్ట చేత్తో పట్టుకుని నడుస్తూ ఉంటుంది.

(ఐదవ తెర-- కళ్లం వెనకతాల ఉంటుంది. ముందుకి చింతచెట్టు - కొంగలు - కొంగల అరుపులు - కొడవళ్లలాంటి చింతకాయలు - ఎండుకొమ్మ - మూడు చింతకాయలు, పీత, నేలని ఓ పక్క చిన్న చిన్న రాళ్లు, తుప్ప - తుప్పపక్క తట్ట - తట్టనిండా పేడ. తాటేకుతో కప్పి ఉంటుంది.)

(ఠప్ మని చప్పుడు)

పారమ్మ : ఓలమ్మో తేలు! (దడుసుకుని ఓగెంతు గెంతి అరుస్తుంది.)

గవిరి : పిరికిగుంటా! మన్నీ దడుసుకున్నా? తేలుకాదు! పీత!

పారమ్మ : నాను పిరికిగుంటని కాను. ఠప్మని అడ్డాది అందుకే గెంతే.

గవిరి : సూడు సూడు. సింతసెట్టుని ఎన్ని కొంగలో! తెల్లతామరల్లా! కొంగ నోట్లోంచి కిందడింది పీత! కొంగా కొంగా గోళ్లు! (గవిరి రెండు చేతులూ బోర్లా పెట్టి గోళ్లు కొంగలకి చూపెడుతూ మీదకి ఎత్తుతుంది)

పారమ్మ : (బండిని కింద పడేసి) కొంగా కొంగా గోళ్లు! కొంగా కొంగా గోళ్లు (రెండు చేతులూ పైకి ఎత్తి గోళ్లని కొంగలకి చూపెడుతుంది)

గవిరి : (చేతులు తిప్పి గోళ్లని చూసుకుంటూ) బలేబలే చూపుడేలు గోరుమీద తెల్లమచ్చడింది. ఈ చేతి మద్యేలిగోరుకీ మచ్చడింది.

(పారమ్మ చేతులు తిప్పుకుని గోళ్లు చూసుకుంటుంది. దానికి మచ్చలు పడవు. ఆ సంగతి చెప్పకుండా చెట్టుపైకి తలెత్తి చూస్తూ ఉంటుంది.)

గవిరి : నీగోళ్లకి మచ్చలడ్డాయా?

పారమ్మ : (దానికి జవాబు ఇవ్వకుండా) ఎన్ని సింతకాయలో!

గవిరి : (తలపైకెత్తి చూడబోయి - తట్టని కిందపెట్టి పైకి చూస్తుంది) పారా! సింతకాయలు కొడవల్లలా ఏల్లాడుతున్నాయే!

పారమ్మ : (ఇటు అటు చూసి రాళ్లు ఉన్న వేపుకి వెళ్లి చేతుల్లోకి నాలుగు రాళ్లు

తీసుకుని కాయలకి గురి చూసి కొడుతుంది. మూడు కాయలు కిందపడతాయి. రెండు కాయల్ని పరికిణీలో దోపుకుని, ఓకాయ కొరుక్కుని తింటూ లొట్టవేసి పుల్ల! పుల్ల! సెడ్డ పుల్లగుంది.)

గవిరి : ఒలే ఒలే పారా! నాకోకాయెట్టవూ?

పారమ్మ : నీక్కావత్తే నువ్వూ కొట్టుకో.

గవిరి : ఒలే ఒలే! ఎట్టవే! ఓకాయెట్టవే! (ప్రాధేయపడుతూ అడుగుతుంది)

పారమ్మ : నువ్వూ కొట్టుకో. అయేటి రాళ్లు!

గవిరి : భయపడుతూ, జంకుతూ కాయలవేపూ రాల్లవేపూ చూస్తూ నిల్చుంటుంది.

పారమ్మ : నాను పెసర గుత్తులు పీక్కోవాలి (సింతకాయ కొరుక్కుంటూ వెనక్కి పొలాలవేపుకి వెళ్లిపోతుంది.)

గవిరి : (ధైర్యం కూడగట్టుకుని నాలుగు రాళ్లు తీసుకుంటుంది. ఓరాయి విసురుతుంది. కాయపడదు గాని రాయి దబ్బుమంటూ కింద పడుతుంది. బెదిరిపోతూ అటూ ఇటూ చూస్తుంది. కాస్సేపు నిలుచుండి పోతుంది. మళ్లీ కాయలవేపు చూస్తుంది. మరోరాయి విసురుతుంది. ఈసారి కాయపడదు గాని ఎండుకొమ్మ గలగల చప్పుడుతో కింద పడుతుంది. గవిరి మొహం చేటంతవుతుంది.)

గవిరి : అయిదెబ్బ! కాయఅడకపోతే అడకపోయింది. ఎండుసింత కొమ్మ దొరికినాది. అయిదెబ్బ! సింతకంపకి ఏడి ఎక్కువ. రొండు సితుకులకే వొణ్ణం వార్పుకి వొచ్చేత్తాది. (సంతోషంతో ఉబ్బితబ్బిబ్బు అయిపోతూ తనలో తాను మాట్లాడుకుంటూ ఎండు కొమ్మని చితుకులుగా విరుస్తూ తట్టలో కుంకుడాకుల మీద పెట్టుకుంటూఉంది.)

గవిరి : ఇయాళ మా మంచిరోజు. పొయినోకి మరి సింతనేదు. కుంకుడాకులు దొరికినాయి సింత సితుకులూ దొరికినాయి. రొండుకి రొండు మాబాగా కుదిరినాయి. మంట బాగా నెగుస్తాది. అయ్య సరుకులొట్టుకొస్తాడు. అమ్మరెయ్యిలొట్టుకు రమ్మంది. రేత్రికి వొరన్నం - రెయ్యిలు - సిల్వరు గిన్నెడుగెంజి! కడుపునిండా గెంజి!

కళ్లంలోంచి
గొంతు : ఎవరక్కడ? (గట్టిగా)

(గవిరి భయం భయంగా తెలెత్తి చూస్తుంది. కాంభుక్త కళ్లాంవేపు నుండి వొస్తూ కనపడతాడు. అదివొణికిపోతూ ఓచేత్తో నెత్తి గోక్కుంటూ, రెండో చేతిని ఏంచెయ్యాలో తెలీక వింటిబద్దలా వొంగిపోతుంది. దాని ఎదురుగా కాంభుక్త వచ్చి నిల్చుంటాడు.)

గవిరి : పోయినోకి (వణికిపోతూ) బాబు పొయినోకి! పోయి, పొయినోకి!

(కాంభుక్త మరికాస్త ముందుకు వస్తాడు తట్టా ఆకూ, చింతచితుకులూ చూస్తాడు. 'దొంగగుంటా' అని తిడుతూ సత్తువపూరా తట్టని ఓతన్ను తంతాడు. తట్టా ఆకూ చితుకులూ ఎగిరి చెల్లాచెదరుగా పడతాయి. అంతంతదూరంలో.)

గవిరి : గడగడా వొణికిపోతూ తట్టని తీసుకుని కుంకుడాకుల్ని నొర్లుకోపోతుంది.

కాంభుక్త : లక్ష్మీకానా! ఇంకా ఎత్తుతున్నా!

గవిరి : బాబుగోరూ మరెప్పుడూ రాను. పొయినోకి! బాబూ! (ప్రాధేయ పడుతుంది.)

కాంభుక్త : హు! పోయినోకి! తేరగా వొచ్చేయి! (అటూ ఇటూ చూస్తాడు. తుప్పవేపు వెళ్తాడు.)

కాంభుక్త : ఏమిటే ఆ తుప్పవార దాచేవ్!

గవిరి : నానేటీ దాచనేదు!

కాంభుక్త : (తుప్పని చేతికర్రతో అటూ ఇటూ ఎత్తి చూస్తాడు) దాచనేదూ? (గవిరిగొంతుని అనుకరించి ఎత్తిపొడుస్తూ) ఇదేటే? (చేతికర్రతో తుప్పని ఎత్తేడు.) తట్టా, తట్టెడు పేడమీదది తాటాకుని కర్రతో పక్కకి తోస్తాడు) దాచనేదూ? ఇదేటే? (చేతికర్రతో గవిరి వెన్నుమీద ఒక్కటి వేసాడు.)

కాంభుక్త : ఏటే ఇది! దొంగలమిడీ! (కొడతాడు)

గవిరి : సచ్చిపోనాను నాయినోయి! నాను కాదు బాబోయి! అమ్మోయి! నానుకాదు.

కాంభుక్త : ఇంకెవరే లంజికానా! మాబాగా మరిగారు దొంగతనాలు! (మళ్లకొడతాడు)

గవిరి : ఎవులు దాసినారో నాకు తెల్దు. కళ్లంనోకి నాన్రానేదు. బాబోయి నాకు తెల్దు. నాను దాచనేదు.

కాంభుక్త : నువ్వుకాక ఇంకెవరే దొంగ గుంటా!

గవిరి : సెపుతున్నానా! నాను కళ్లంనోకి రానేదు. నీ కళ్లంనోకి నానడు గెట్టనేదు. నాను కాదు.

కాంభుక్త : చేసింది చాలక మాటకి మాట చెపుతున్నావే!

గవిరి : నిజం సెపుతున్నా - ఇనవేంటి? నానుకాదు. నాను నీ కళ్లంనోకి అడుగెట్ట నేదు. సూడు, నా తట్టాసేతులూ సూడు, పేడ మరకలున్నాయా? (ధైర్యంగా అడుగుతుంది)

కాంభుక్త : (మళ్లా కర్రతో కొడతాడు.)

గవిరి : అమ్మో! నానుకాదు. సెపుతున్నానా! నాను కాదు బాబోయి! సూడు, నాతట్టా సేతులు. పేడమరకలున్నాయా? దాకలా సూపెడుతున్నా

సూడవేంటి? (కోపంతో) ఓర్నంజకొడుకో! నానుకాదు. ఓలమ్మో నానుకాదు. ఓర్నంజకొడుకో నానుకాదు.

కాంభుక్త : (కొడుతూనే) గుంటముండా! ఎన్నిగుండెలే నీకు! నన్నే తిడుతున్నా! లమ్డీకానా! గొంతులేస్తోందే! (కోపంతో రెచ్చిపోయి పాంకోడు తీసి విసిరి కొడతాడు. గవిరి పిక్కకి పాంకోడు తగిలి పక్కని పడుతుంది.

గవిరి : అమ్మోయి సచ్చిపోనాను! (గట్టిగా ఏడుస్తూ కింద పడిపోతుంది. గిలగిలా కొట్టుకుంటూ కాళ్లూ చేతులూ చుట్టబెట్టుకుపోతోంది.)

కాంభుక్త : హు! గుంటముండలకి పొగరు రోజు రోజుకీ పెరిగిపోతోంది! అణిగిందా దొంగలంజా పొగరు? (పాంకోడు కాలికి తగిలించుకుని కళ్లంలోకి చేతికర్ర ఊపుకుంటూ వెళ్లిపోతాడు.) (హూంకరిస్తూ) గవిరి వెక్కివెక్కి ఆపకుండా ఏడుస్తూ ఉంటుంది. సొమ్మసిల్లి - ఏడ్చి ఏడ్చి - సొమ్మసిల్లి కళ్లుమూసు కుంటుంది.

(లైటుని బాగా తగ్గించాలి. 2 నిమిషాలు విరామంగా ఆగుతూ విచారకరమైన వాద్యగీతం. బళ్లోంచి పిల్లల ఎక్కాల వల్లె గట్టిగా వినిపిస్తూ ఉంటుంది.)

పిల్లల గొంతులు : మూడేళ్లు ఇరవైయొక్కటీ!

: మూడేళ్లు ఇరవైయొక్కటీ!

(గవిరి కళ్లు తెరుస్తుంది. మెల్లిగా చుట్టూరా చూస్తుంది. కళ్లంవేపు కాస్సేపు కన్నార్పకుండా చూస్తుంది. చెల్లా చెదురుగా పడిన కుంకుడాకునీ, చింత చితుకుల్నీ చూస్తుంది. నెమ్మదిగా, బాధతో, నొప్పిని అణుచుకుంటూ లేచి నిల్చుంటుంది. ఒంగిపోయి కంపకట్టని చేతిలోకి తీసుకుని కుంకుడాకుని కూడదీస్తుంది. అల్లంత దూరాన పడిన తట్టనితెచ్చుకోవడానికి ఒంగి ఒంగి బాధతో నడిచివెళ్తుంది. తట్ట తెచ్చుకుని తట్టలోకి కుంకుడాకులు ఎత్తుతూ)

గవిరి : లమ్డీకొడకా! నీసింతకంపలెవిడికీ అక్కరనేదు! బోడి సింతకంప! నాకుంకుడాకు నాకు శాన! సత్తెం సెప్పినా దాకలా సూపినా కొడతావట్రా లంజకొడకా! నానోరు నెగదా! నాను సెయ్యని దొంగతనం నాకంట గట్టినావు! నీ ఆలిముండమొయ్య! నాను కాదురా లమిడీ కొడకా! నీకళ్లంలో నీపాలేర్లనడగరా! ఎవులు దొంగలో!

(తిట్ల మీద తిట్లు తిడుతూ గవిరి తట్టని తలకెత్తుకోపోయి. పిక్కనొప్పితో తట్టతో పాటు కింద చతికిల్లా పడిపోతుంది.)

"అమ్మో నొప్పి! మంట! మంట! మండిపోతోందిరా! నెత్తురు గూడుకట్టిపోనాదిరా బాబోయి'' (దెబ్బని చూసుకుంటూ చేత్తో నెమ్మదిగా రాసుకోబోయి, చెయ్యి పెట్టి తీసేస్తూ

మళ్లీ తిట్లు లంకించుకుంటుంది.)

ఓలమ్మో! ఎంత దెబ్బతగిలినాదిరా! బాబోయి! ఓర్లమ్డి కొడకా! ఓర్నంజకొడకా! ఎంతనా కొట్టేసినావురా నీ సింతకంపలెవిడికి కావాల్రా! ఓర్లమ్డికొడకా!

(తిడుతూనే నెమ్మదిగా లేచి తట్టనెత్తిని పెట్టుకుని వొంగివొంగి గుడిసెవేపు నడుస్తుంది)

(బళ్లో పిల్లల ఎక్కాల వల్లె గట్టిగా)

పదహారు ఆర్లు తొంభైఆరు! పదహారు ఆర్లు తొంభైఆరు!

పదహారు ఆర్లు తొంభైఆరు! పదహారు ఆర్లు తొంభైఆరు!

తెర

.....................................................................................................

ఈనాటికని చాసో స్ఫూర్తి పురస్కార ప్రదానోత్సవంనాడు (1-17-2017) విజయనగరం గురజాడ కేంద్ర గ్రంథాలయం, చాసోసాహితీవేదిక (ఏసిహాలు ప్రారంభోత్సవ సభ) మీద బొండపల్లి జెడ్.పి.హెచ్.ఎస్. విద్యార్థులు జి.ఎస్.చలం దర్శకత్వంలో ప్రదర్శించారు. నేపథ్యసంగీతం : శ్రీ రాజు అందించారు. గవిరిగా బి.శరణ్య, పారమ్మగా జె.భవాని, బడిపంతులుగా జి.ఎస్.చలం, అప్పలనాయుడుగా ఐ.జ్ఞానేశ్వర్, చినదేముడుగా ఎం.ఆదియ్య మాస్టారు, కాంభుక్తగా రౌతు విజయకుమార్ నటించారు. గవిరి, పారమ్మల నటనను ప్రశంసించి ఆచార్య కేతు విశ్వనాథరెడ్డిగారు, శ్రీ.కె.శ్రీనివాసుగారు (ఆంధ్రజ్యోతి) బహుమతులు అందించారు.

సాంస్కృతిక శాఖ మరియు నవరసథియేటర్, ఆర్ట్స్ అసోసియేషన్ ఆధ్వర్యంలో విశాఖపట్నం ఎండాడ జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలో జరిగిన బాలలనాటిక పోటీలలో రెండవ ప్రదర్శన జరిగింది. గవిరిగా బి.శరణ్య, పారమ్మగా జె.భవాని, బడిపంతులుగా కె.హరికిరణ్, అప్పలనాయుడుగా ఎం.వంశీ, చినదేముడుగా బి.కుమార్, కాంభుక్తగా ఆర్.వర ప్రసాద్ నటించారు. అన్ని పాత్రలు పిల్లలే నటించడం దీని ప్రత్యేకత. ఈ పోటీల్లో గవిరిపాత్రధారి బి.శరణ్య ఉత్తమ నటిగా ఎంపికై సీనియర్ నటుడు శ్రీ పి.ఆర్.జె.పంతులు గారి చేతులుమీదుగా బహుమతి స్వీకరించింది. జి.ఎస్.చలంగారే దర్శకత్వం వహించారు.

నాటికలో ఇచ్చిన వెనకతెరల సూచనలను చలంగారు తమకు అనుగుణంగా వాడుకొని నాటికను రక్తి కట్టించారు.

కథప్రచురణ : 1943-ఫిబ్రవరి-అరసం ప్రత్యేక సంచిక

.....................................................................................................

# వజ్రహస్తం

(ఏకపాత్రాభినయరూపం)

లైట్స్ వెలుగుతాయి

(కాటేజి ఎదట గుండుతో అంగవస్త్రంతో ఉన్న ఆఫీసరు)

చెపుతాను! చెప్పమంటున్నారా? వినండి.

ఏంచెప్పను! ఏం చెప్పను!

వొద్దు వొద్దు, మహాప్రభూ! ఈ శిక్షశత్రువుకి కూడా వొద్దు. ఏదో అనుకుంటాం అంతా మన చేతిలో ఉన్నట్టు! మన చేతిలో ఏమీలేదు. అంతా వాడి చిద్విలాసం.

అంతా ఏమనుకున్నారు? సరి పని వీడిపని సరి. నువ్వేమనుకున్నావు? వాడు? వాడు? వాడేమనుకున్నాడు! సరి సరి సరే అనుకున్నారు.

ఉరితాడు పీకమొయ్యా బిగించారు. బిగిసిపోతూ ఉరి ఉరిశిక్షకాని ఉరిశిక్ష. బతికివుండాలి క్షణక్షణం ఉరితాడు బిగిస్తూ చంపుతూ వుండాలి. వాడు చక్రంవేసి ఉరితాడుని ముక్కముక్కలు చెయ్యకపోతే? వొద్దు. శత్రువుకి కూడా ఈశిక్షవొద్దు.

మూడు సంవత్సరాలు భగవంతుడే పరీక్షలో పెట్టాడు. అబ్బబ్బ, అంత పరీక్షా? నిలబడతానా లేదా? నిలబడ్డాను. పరీక్షకి తట్టుకున్నాను.

భగవంతుడు మనపక్షంవున్నప్పుడు కౌరవ అక్షౌహిణీలు మననేం చేస్తాయి? నువ్వు తప్ప ఇంక శరణులేదు సుమా అన్నాను. పట్టుకున్నాను.

ప్రతిక్షణం 'భగవాన్, భగవాన్' ఆత్మఘోష పెడుతూనే వుంది. ఎదురుగా కనబడుతూనేవున్నాయి. ఏడుకొండలవాడి వజ్రహస్తాలు. వరదా! తండ్రీ! ఏదీ నీవరం? అభయం! ఇంక భయం లేదు. ఉంది ఉంది తండ్రీ నీ అభయహస్తం! నీవజ్రహస్తం!

భగవాన్! నీ చక్రముండగా ఏ మకరం పట్టుకోగలదు?

కనబడుతూనే వున్నాయి. మూడేళ్లు అనుక్షణం కనబడుతూనే వున్నాయి. ఏడుకొండలవాడి వజ్రహస్తాలు! ఒకటి అభయం చెపుతున్నాది. ఒకటి వరం యిస్తున్నాది. తెలుస్తూనేవుంది. ఇది భగవంతుడు చేస్తున్న పరీక్ష. వేరొకటికాదు.

నేనేం నేరం చేశాను? నే చేసిన ఏపనీ నేరం కాదు. నేరమైతే ఎవడు చెయ్యడు? నాపదవిలోవున్నవాడు ఎవడు చెయ్యలేదు? నాదృష్టిలో అంతా చేస్తున్నారు. చట్టాలు అలాగ్గా తగలేసుకున్నారు.

అక్కన్న మాదన్న లేం చేశారు? గోలుకొండ నవాబుగారి రాజ్యంలో అక్కన్న మాదన్నలకి ఇంగ్లీషువారు కొన్ని లక్షలు నజరాణా యివ్వలేదా? నజరాణా అంటే ఏమిటి? లంచమంటే ఏమిటి?

పదవిలో వున్నవాడి కాళ్లు పట్టుకుంటారు. చేతిలో పెడతారు. తప్పా? చెప్పండి. అధికారంలేని వాడు ఏం చెయ్యగలడు? పిడకలు! అధికారంవుంది. ఒచ్చిపడతారు. నువ్వు భగవంతుడివి అంటారు. అధికారి భగవంతుని అంశ కలవాడు. రాజు! నావిష్ణుఃపృథివీపతి!

చట్టం ప్రజలకోసం. ప్రజలని అదుపులో వుంచటానికి చట్టం. రాజుకోసమా చట్టం? రాజు చేసిన చట్టాలు ఏనాడైనా రాజుకి వర్తించాయా? వర్తిస్తాయా?

ఈనాడు రాజస్థానంలో ప్రజాస్వామ్యం వుంది. ప్రభుత్వాన్ని నడుపుతున్న వర్గం వుంది. చట్టం ప్రజల కోసం. ప్రభుత్వ వర్గం కోసం కాదు.

వింటున్నారా? ఇవి ఉన్నతమైన రాజకీయ విషయాలు. అంతర్గతమైన మహారహస్యాలు.

మోపుచేసేశారు. నామీదకొచ్చింది. అక్రమంగా డబ్బుపుచ్చుకుంటున్నానుట! చేసుకున్నానుట! రుజువు చేస్తారుట!

సస్పెన్షన్! ఉద్యోగం నుంచి సస్పెన్షన్ ఉత్తర్వు జారీ అయింది. ఐదేళ్లలో పెన్షన్ పుచ్చుకోవలసిన వాడికి సస్పెన్షన్!

నేరం రుజువైతే ఏంజరిగేది? ఉద్యోగం నుంచి బర్తరఫ్. అంతే అయితేనా? పూతికతో సమానం. కాదే! జైలుశిక్షపడుతుంది. జైలుశిక్ష పడితే బతకడంబతకడమా? చెప్పండి! ఉచ్చులోపడ్డ మరుక్షణం చుట్టూ అంతా శత్రువులే. ఒక్కడు మాటలాడ్డు. ఒక్కడు కనబడ్డు.

ఇంటికి వెళ్లి దేముడి పట్టుకెదురుగా నిలబడి చేతులు జోడించి "ఏడుకొండలవాడా! వెంకటరమణా!" రక్షించు! రక్షించు! శరణుతండ్రీ! శరణు శరణు. శరణు జొచ్చాను.

కళ్లమ్మడి నీళ్లు కారిపోతున్నాయి. వొళ్లు గడగడలాడిపోతున్నాది. శివజ్వరంతో కుదుపుపట్టుకొన్నాది. నాపెళ్లాం? నాపెళ్లాం లెంపలు వాయించుకుంది.

అదీ శరణు జొచ్చింది

"కాపాడు తండ్రీ! కాపాడు! నాభర్త పొరపాటు క్షమించు. ఆయనపైకి ఏంచెప్పినా మీదాసానుదాసుడు. రక్షించు, రక్షించు మహాప్రభో! నువ్వు తప్ప మాకెవరూ లేరు. నీకొండకొస్తాం. పిల్లలందరితో వస్తాను. నేను ఏడుకొండలు ఎక్కి వస్తాను. నావొంటి మీద నగలన్నీ నిలువుదోపు యిస్తాను. ఇదిగో ఇప్పుడే నీకు ముడుపుకడతాము. మహాప్రభో! మహప్రభో! అని అదీ నాతోపాటు ఏడుస్తూ ముక్కుపుడక లగాయితు నగలన్నీ తీసేసింది. పుస్తెలు తీసేసి పసుపుకొమ్ములు కట్టుకుంది. నగలన్నీ మూటకట్టి ముడుపుకట్టింది. ఇదంతా ఏమిటంటారా? భగవంతుడు నన్ను చేస్తున్న పరీక్ష. ఏమీ సందేహం లేదు.

బ్రాహ్మణ్ణెప్పుడైనా పిలిచానా? నా చుట్టు ప్రక్కలకి రానిచ్చానా? పూజా పునస్కారాలు చేయించానా? ఎన్ని అపభ్రంశం మాటలన్నాను? ఎన్ని తిట్లు తిట్టేను!

నేనేనా? వాణ్ణేనా నేను? నేను ఉన్నాను సుమా అన్నాడు భగవంతుడు! నీపోత్రం నాదగ్గర కాదన్నాడు. దాసోహం కమ్మన్నాడు.

'దాసోహం! దాసోహం' అన్నాను. జ్వరం! మహాజ్వరం. శివజ్వరం. క్షణం ఒకయుగం. రోజు ఘనీభవించి శిలకట్టుకుపోతోంది. శిలాభారంతో తల వ్రయ్యలైపోతున్నాది. ఏమిటి సాధనం? ఏమిటి సాధనం!

సద్బ్రాహ్మణులని పిలిచి గ్రహపూజలు, గ్రహశాంతులు, గ్రహజపాలు చేయించాను. శివాలయంలో ప్రతి సోమవారం వంద కొబ్బరికాయలు కొట్టిస్తూ రుద్రాభిషేకాలు చేయించాను.

ఉదయం స్నానంచేసి, పచ్చిమంచినీళ్లు ముట్టుకోకుండా పట్టుపంచ కట్టుకొని పీటమీద కూర్చొని రామాయణం తీసి సుందరకాండ పారాయణం రోజూ చేశాను. నిత్యం. అవును. నిత్యం.

మహాత్తు వుందన్నారు. మహత్తు వుంది. మూడేళ్లు ఎలాగ్గా గడిచాయి? నిముషం నిముషం చొప్పున మూడేళ్లు గడిచాయి. నిముషమంటే మాటలా? ప్రతి నిముషం అరవై బ్రహ్మజెముడు ముళ్లగుబుర్లు. ఎల్లాగ్గా గడిచాయి? ఎల్లాగ్గా గడిచాయి?

ఏడుకొండలవాడి వరదహస్తం ఎదురుగా వుంది. ఏడుకొండలవాడి అభయహస్తం ఎదురుగుండా ఉంది. ఏడుకొండలవాడి వజ్రహస్తాలు కాపాడుతూ కనబడుతూనే వున్నాయి.

నాతో అయిందా? వింటున్నారా? నా స్నేహితుడి మీదకొచ్చింది. చిత్రం! శ్రీమన్నారాయణ మీది కొచ్చింది.

చెప్పండి. మీరంతా చెప్పండి శ్రీమన్నారాయణ ఎవడు? మామ్మూలు వాడా? సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడు! ప్రజలను ఆపదలో ఆదుకొనేవాడు. ప్రజల మధ్య పని చేస్తున్నవాడు. ప్రజల నోట్లో నాలికలాంటివాడు. మహామేధావి, రాజకీయాల్లో ఆరితేరిన వాడు. ఊరికి ఉపకారి. మండలానికి ఉపకారి. జిల్లాకి ఉపకారి. రాష్ట్రానికి ఉపకారి.

ఔనంటారా? ఔనా?

పెరిగిపోతున్నాడు శ్రీమన్నారాయణ. విష్ణు అంశతో పెరిగిపోతున్నాడు. మొహంలో రాజవర్చస్సు కనబడిపోతున్నాది. రాష్ట్రస్థాయికి వచ్చేశాడు. దేశం మొత్తం మీద వినబడు తున్నాడు. అన్ని హంగులూ ఉన్నవాడు. మంత్రి కావలసినవాడు. ముఖ్యమంత్రి కావలసిన వాడు! ప్రధానికాదగ్గవాడు.

మీకేంతెలుసు? నాకు తెలుసు. చిన్ననాటి నుండి నా స్నేహితుడు. ఏమిఘోరకలి! ఏమి ఘోరకలి! వాణ్ణి ఇరికించేరు. ఖూనీ కేసులో! ఖూనీ చేయించాట్ట! పక్కలో బల్లెంలాగ ఉన్న రాజకీయ శత్రువుని నక్సలైట్ల మీదికి నెట్టుకుపోతుందని ఖూనీ చేయించాట్ట!

ఔనంటారా? కాదంటారా? వెనకనుంచి వెన్నుపోటు పొడవడానికి పొంచున్న శత్రువుని పిట్టని కొట్టినట్టు కొట్టద్దా?

తాను చేయలేదు. ఔనా? చేయించాట్ట! శత్రువుని సంహరించమనే చాణక్యనీతి. రాజరికంలో అడ్డంగా ఉన్నవాణ్ణి అడ్డంగా నరికేయడమే న్యాయం.

కొట్టేడా? కొట్టించాట్ట! చూసినవాడు లేడు. టటట! అంతా టటట! తెలిసినవాడు లేడు!

నాతలవెయ్యి చెక్కలై నేచస్తున్నాను. శ్రీమన్నారాయణ కేసుతో నానడుం జారిపోయింది.

ఈ శిక్ష శత్రువుకి వొద్దు. భగవంతుడే మా యిద్దర్నీ పరీక్షలో పెట్టాడు. పరీక్షకి తట్టుకుంటామా లేదా పరీక్ష చేస్తున్నాడు. నట్టేట్లో పడిపోయాము. నడిసముద్రములో కొట్టుకుపోతున్నాము. కళ్లుమూసుకున్నా కళ్లుతెరిచినా అభయహస్తం కనబడుతున్నాది. వరదహస్తం కనబడుతున్నాది. వజ్రహస్తాలు కనబడుతున్నాయి.

తీర్పు వొచ్చేసింది. మీరంతా ఆనందం పట్టలేకపోయారు. నానేరాలు రుజువుకాలేదు. నేనేరం చేయలేదు! భగవంతుని విలాసం. ఏడుకొండలవాడి చక్రప్రయోగం. చక్రి ఆ చక్రం!

వెంటనే ఆవెంటనే ఉన్న రైలుకి ప్రయాణం కట్టేశాం. ఏడుకొండలవాడి సన్నిధికి.

నాపెళ్లానికి కీళ్లనొప్పులా? ఆ నొప్పులతో మెట్లెక్కిపోయింది. ఇచ్చేశాడు భగవంతుడు దానికి ఏనుగంత శక్తి. పిల్లలు ఛంగుఛంగుమని కోతుల్లాగ గెంతుతూ పోయారు.

నన్ను పరీక్షలో పెట్టేడాభగవంతుడు. నవనాళ్లూ తోడుకుపోతూ శరీరభారం మొయ్యలేక మెట్టుమెట్టు ఏడుకొండలవాడి స్మరణ చేస్తూ ఎగబడ్డాను.

నాశక్తికి మించిపోయి కొండలు కనబడుతున్నాయి. తండ్రీ నన్నెలాగ తీసుకెళతావూ నీచరణ సన్నిధికి అని వాడి మీదే భారం వేసి ఎగబడగా గాలిగోపురం చేరుకున్నాను. నడవగా నడవగా మోకాలి పర్వతం చేరుకున్నాను.

చూడండి. బాధగావుంటే "ఏడుకొండలవాడా! గోవిందా గోవింద" అంటూ నామస్మరణ అన్ని వేపుల నుంచి, మీదనుంచి, కిందనుంచి వొస్తూవుంటే నాకు తెలియకుండా శరీరాన్ని మోసుకుపోయాను.

మోచేతులతో, మోకాళ్లతో వొగరుస్తూ, ఎగబడుతూ మోకాలిపర్వతం ఎక్కేను. ఎక్కిపోయాను. కొండెక్కిపోయాను.

"భగవాన్, నీ సన్నిధానానికి వచ్చాను. ఏడుకొండలవాడా! గోవిందా! గోవింద!" నామస్మరణ చేసుకున్నాను.

కాటేజ్ పుచ్చుకున్నాను. అందరం స్నానాలు చేసి కళ్యాణ కట్టకి పోయాం. నేనూ, నాపెళ్లాం పిల్లలు అందరం కేశసమర్పణం చేసుకున్నాం.

అణిగిపోయింది నాపోత్రం. అణిగిపోయింది నా అహం. ప్రాయశ్చిత్తమైపోయింది. నాపెళ్లాం నిలువు దోపు అర్పించుకుంది.

"నువ్వించిందే తండ్రీ, నాదేం కాదు. నీదినీకేయిస్తున్నాను. మహాప్రభో!" అని కళ్లనీళ్లు పెట్టుకుంది మహదానందంతో! ఏడుకొండలవాడికి కళ్యాణం చేయించి, దర్శనం చేసుకొని, ప్రసాదం తిని కాటేజికొచ్చాం.

నన్ను బాధపెడుతున్నది శ్రీమన్నారాయణకేసు. కేసు ఏమైంది? భగవాన్! వాణ్ణి రక్షించు. నన్ను కాదు. నేనుకాదు. వాడురక్షించదగ్గవాడు. ముఖ్యమంత్రి కాదగ్గవాడు. ప్రధాని కాదగ్గవాడు. కుట్రలో యిరుకున్నాడు. ఖూనీ కేసులో! ఖూనీచేయించాడని! రక్షించు తండ్రీ! రక్షించు!

వాడికోసం నాప్రాణం తహతహలాడిపోతున్నాది. చూశారా? వింటున్నారా? నాకు భగవంతుడు కనబడుతున్నాడు. మీకో? మీకు కనబడుతున్నాడా? చూశారా? మీఒళ్లు గగుర్పొడుస్తున్నాది. భక్తితోవుంది స్వామిశక్తి.

(దీపాలు ఆరి వెలిగేసరికి ఆఫీసరు కోటు ఫేంటు, హేటుతో)

చూశారా? నావేషం. నావేషంనేను వేసుకున్నాను. నాకోటు. నాఫేంటు. నాహేటు. నేనెవణ్ణో యిప్పుడు చూడండి. ఫస్టుక్లాసు ఆఫీసర్ని నేను నేనయ్యాను. మూడేళ్ల తర్వాత ఏడుకొండలవాడు ఏడుకొండలు దాటించాడు. తన సన్నిధానంలో ఆఫీసరుగా, ఏడుకొండలవాడి భృత్యుడిగా నిలబడమన్నాడు.

కాటేజీ ఎదురుగా నిలబడ్డాను.

చిత్రం చూడండి

ఎదురుగా కనబడుతున్న దృశ్యం ఏమిటో తెలుసా? ఏమిటది? ఎవరిది? ఎవరో మహానుభావుడు. మహాభక్తుడు. ఏదో అర్థించి నాకాటేజీకి వచ్చాడు. ఎవరో చెప్పేశారు ఆయనకి నేను ఆఫీసర్నని!!

"ఏడుకొండలవాడా! గోవిందా! గోవింద! అని కేకపెట్టాడు.

ఎలా ఉన్నాడాయన? బుర్రనల్లగా ఇనుపగుండులా వుంది. తల, మీసాలు నున్నగా గీయించుకున్నాడు. నుదుటినిండా నుదురు నిండిపోయి నామం పెట్టుకున్నాడు. చిన్న అంగవస్త్రం కట్టుకుని ఉన్నాడు. భయోత్పాతం కలిగించే రూపం! మహాబీభత్సమైన విగ్రహం! నాదగ్గిరికి ఏంకావలిసి ఏ కోరికతో వచ్చాడో! ఏడుకొండలవాడేకాని, ఆ ఉగ్రరూపంలో నా దగ్గరికి రాలేదుకదా! భ్రాంతిలో పడియాను. జాంబవంతుడంత మనిషి. జాంబవంతుడిలా వున్నాడు. నన్ను పరీక్షచెయ్యడానికి వెంకటరమణుడే ఆరూపంలో రాలేదుకదా! ఆనుదుటిమీద నామం ధగధగలాడుతున్నాది. శరీరం నలుపు నిగనిగలాడు

తున్నాది.

'స్వామీ! తమకేం కావాలి?' అని అడిగాను.

"ఏడుకొండలవాడి అనుగ్రహం కావాలి నాయినా!" అన్నాడు.

వింటున్నారా? వాడిఅనుగ్రహం కావాలి.

"చిత్రం. తమకేం కావాలి" అని అడిగాను. వాడే మడిగినా, భక్తుడైనా, దొంగ భక్తుడైనా యివ్వడానికి సిద్ధంగావున్నాను.

"నేన్రా! నేన్రా!" అన్నాడు వాడు.

నాపెళ్లాం "శ్రీమన్నారాయణగారండీ!" అంటూ లోపల్నించి బయటికి వచ్చేసింది.

నాకళ్లను నేను నమ్మలేకపోయాను.

శ్రీమన్నారాయణుని యిలా వివస్త్రుడైవుండగా నేనెప్పుడైనా చూశానా? పిసరంత పోల్చలేకపోయాను.

మొహంనిండా బొద్దుమీసాలు, తలనిండా ఉంగరాల జుత్తు, తెల్లని చొక్కా, తెల్లటిపంచె, తెల్లటిసిగరెట్టు కారులోంచి దిగి నాయింటికి వచ్చే శ్రీమన్నారాయణ ఎక్కడ? భగవత్సన్నిధానంలో ప్రాయశ్చిత్తం చేసుకుని అంగవస్త్రంతో నిలబడ్డ శ్రీమన్నారాయణ ఎక్కడ?

ఆనందభాష్పాలతో కౌగలించుకున్నాము. భగవంతుడు వాణ్ణి రక్షించాడు. బయటపడ్డాడు. నావెనకేవచ్చాడు. నాతోటే వచ్చాడు. హుటాహుటీ మొక్కు చెల్లించు కుంటానన్నాడు. హుటాహుటీ వచ్చేశాడు.

"ఏడుకొండలవాడా! ఏలీలని ఎవరిని ఎందుకు కాపాడుతావో ఎవరికి తెలుసు నయా? ఏడుకొండలవాడా!

నన్ను రక్షించావు. శ్రీమన్నారాయణని రక్షించావు. దేశానికి కావలసినవాడు. వాణ్ణి రక్షించావు!" అని స్తవం చేశాను.

(వింగ్ లోంచి ఎన్నో గొంతుకలతో...)

'పరమేశ్వరుని నిర్ణయాలు పామరులకి బోధపడవు' - 'పరమేశ్వరుని నిర్ణయాలు పామరులకి బోధపడవు' 'పరమేశ్వరుని నిర్ణయాలు పామరులకి బోధపడవు' -- ఇలా రిపీట్ అవుతూవుండగా లైట్స్ ఆఫ్.

---

చిన్నచిన్న జోడింపులు తప్ప అంతా చాసో రాసినదే!

- తులసి

---

కథప్రచురణ : 1974-దీపావళి సంచిక - ఆంధ్రజ్యోతి వీక్లీ

# ఇదా నాగరికత!

(బెంగాలీ వ్యంగ్య నాటిక) (-1860 ) Staged 1866

మూలం : మైకేల్ మధుసూదన్ దత్త్ (1824 - 1873)

పాత్రలు

| | |
|---|---|
| గృహస్థు | గృహిణి |
| నవకుమార్ బాబు | ప్రసన్నమయి |
| కాళీబాబు | హరకామిని |
| బైరాగి బాబాజీ | నృత్యకాళి |
| వైద్యనాథ్ | కమల |
| | పయోధరి |
| | నితంబిని |

పెద్దమనుషులు, సార్జెంటు, చౌకీదార్, వాద్యగాళ్లు, బట్లరు, బేరరు, దర్వాను, మాలి, ఐసుకుర్రాడు, ఇద్దరు కూలివాళ్లు, తాగుబోతు, ఇద్దరు వేశ్యలు.

మొదటి అంకం

మొదటి గర్భాంకం

నవకుమార్‌బాబు ఇల్లు

(నవకుమార్ బాబు, కాళీనాథ్‌బాబు కూర్చుని ఉంటారు.)

కాళీ : అయితే ఏమిటంటావ్?

నవ : ఇంకే మంటాను బ్రదర్! నాన్నగారు ఇన్నేళ్ల తర్వాత బృందావన్ నుంచి తిరిగి వచ్చేరు. ఇహ నేను ఇంట్లోంచి బైటకి అడుగుపెట్టడం సున్నా.

కాళీ : చచ్చేం! ఇహ దీనికి ఇంకోదారి ఏం లేదా?

నవ : ఇంకేందారి? సంస్థని ఎబాలిష్ చెయ్యాల్సిందే!

కాళీ : వారెవా! నీకు గాని పిచ్చెత్తిందా ఏం? ఇలాంటి సంస్థని ఎవడైనా ఎక్కడైనా ఎబాలిష్ చేస్తాడా? అంతంత తుఫానుల్లోంచి పడవని లాక్కుని వచ్చేమే! ఇప్పుడు ఒడ్డుకు వచ్చేక చుక్కాని వదిలెయ్యడం తగునా? మన సబ్‌స్క్రిప్షన్ లిస్టు చాలా పూర్‌గా ఉన్నప్పుడు మన జేబుల్లోంచి డబ్బు పెట్టి కాపాడు కొచ్చేమే సంస్థని! ఇప్పుడు...

నవ : అరే, ఇదంతా నేనెరగని సంగతా? నువ్వు మొదట్నించీ మళ్లీ ఏకరువు పెడుతున్నావ్! నేనేమన్నా కావాలని సంస్థని ఎబాలిష్ చేస్తున్నానా బ్రదర్! ఏం

చెయ్యనూ? పట్టుమని పదినిమిషాలకైనా నేను ఇంట్లోంచి బైటకి వెళ్లేనా ఆ వెంటనే నాన్నగారు ఆరాతీస్తున్నారు. అంచేత అబ్బాయీ, సంస్థకి రావడానికి నాకు దారీ సందూ ఎక్కడున్నాయి? (గట్టిగా నిట్టూరుస్తాడు.)

కాళీ : ఏంచావు వచ్చిపడిందీ! నీమాటలు విని గొంతు పూర్తిగా ఆర్చుకుపోయింది. నవబాబూ! ఉన్నాదా ఏమన్నా?

నవ : హుష్ - అలాగట్టిగా అరుస్తూ మాట్లాడకు. ఓ బ్రాండీ బహుశా ఉన్నాది.

కాళీ : (సంతోషంగా) జస్ట్ ది థింగ్. మరి అయితే తేవయ్యా తే.

నవ : ఉండు చూస్తాను. (నాలుగువేపులా చూస్తూ) నాన్నగారు లోపల్నుంచి బైటకి ఇంకా రాలేదు. (గొంతుపెంచి) ఏయ్ వైదే!

వైదే : (లోపల్నుంచి) వస్తున్నానయ్యా!

కాళీ : ఇవాళ రాత్రికి ఓసారి నువ్వు రావాలి బ్రదర్! (స్వగతం) - అయ్యొయ్యో! ఈ ముసిలాడు కాలం కానికాలంలో ముసురుకు వచ్చిన మబ్బులా మాప్లెజర్‌ని పాడుచెయ్యడానికి వచ్చి తగలడ్డాడు! ఈ నవబాబే మాలీడరు. వీడే మనీమేటర్స్‌లో విశేషించి సాయపడతాడు. వీడు కాని వదిలేశాడా ఏముందీ! అంతా బుగ్గీ బూడిదే! దాంట్లో ఎంతమాత్రం సందేహం లేదు!
(వైదే వస్తాడు.)

నవ : నాన్నగారు ఎక్కడున్నార్రా?

వైదే : పెద్దయ్యగారు ఇంకా లోపల్నుంచి బయటికి రాలేదు.

నవ : అయితే సరే, ఆబాటిలూ ఓ గ్లాసూ వేగిరంగా తీసుకురా! (వైదే వెళ్లిపోతాడు)

కాళీ : అవునూ నవబాబూ మీనాన్నగారు పక్కా వైష్ణవులా?

నవ : (గట్టిగా నిట్టూర్చి) ఏడవ్వాల్సిన సంగతి బ్రదర్! ఏం అడుగుతావ్! కలకత్తా మొత్తాన్ని అంత భక్తుడు మరొకడు లేడు! బాటిలూ తదితరాలూ పట్టుకుని వైదే వస్తాడు)

కాళీ : ఇలా ఇటుతే.

నవ : తొందర తొందరగా కానియ్యి బ్రదర్! ఇహనింక ఆరావణుడూ లేడు ఆ బంగారులంకా లేదు!

కాళీ : పోనీలే, లేకపోతే ఏం అయిందిలే - ఇది ఉందిగా! (బాటిలు చూపెడుతూ) అహహా! అహహా! (బ్రాండీ తాగుతాడు)

నవ : అరే, అరే - ఏమిట్రా ఇంకా ఇంకానా?

కాళీ : ఉండుండు. మరికాస్త తాగనీ - అవునూ, మంచి జనరల్ సరియైన అదునులో తన గారిసన్‌కు ప్రొవిజన్లు సమకూర్చడంలో వెనుదీస్తాడా? అహహ - అహహ (బ్రాండీ మళ్లీతాగుతాడు)

నవ : (వేదేతో) బాటిలూ గ్లాసూ పట్టుకుపో - వెళ్లి వేగిరం కిళ్లీలు తీసుకురా. (వేదే వెళ్తాడు)

కాళీ : బ్రదర్! ఇహ మీనాన్నగారి దర్శనం ఓసారి చేయించు. నువ్వు మాత్రం ఇవాళ రావాల్సిందే. నిన్ను వదిలేసి ఇవాళ ఏ గాడిదకొడుకూ వెళ్లడు!

నవ : నీ కాళ్లు పట్టుకుంటాను. కాస్త నెమ్మదిగా మాట్లాడు. (కిళ్లీలు పట్టుకుని వేదే వస్తాడు)

కాళీ : ఏదీ ఇలా ఇటు ఇయ్యి. (లోపల్నుంచి) 'ఏయ్ వైద్యనాథ్!' వేదే వెళ్లిపోతాడు.

నవ : అదిగో నాన్నగారు వస్తున్నారు. ఇంద మరో కిళ్లీ వేసుకో.

కాళీ : కిళ్లీ కాదు బ్రదర్ నేను వేసుకోవాలనుకునేది! పెగ్గు! పెగ్గు వేసుకోవాలి. సరిసరేలే - పద మీనాన్నగారిని ఓసారి చూస్తాను.

నవ : (నవ్వుతూ) నువ్వేం అంత కష్టపడిపోనక్కర్లేదు. నీబండిని గుమ్మం ముందు చూసీ చూడగానే ఎవరా అని ఆయనంతట ఆయనే ఇక్కడికి వేంచేస్తారు!

కాళీ : ఏమంటున్నావూ!! అయిసే! (I say) మీనౌకరుని ఇంకాస్త బ్రాండీ తెమ్మని చెబ్దూ! నాగొంతు మళ్లీ తడారిపోతోంది!

నవ : చచ్చేం! నీ క్కాస్తంత నిషా ఎక్కినట్టే కనపడుతోంది! ఇంకా వేసు కుంటావా?

కాళీ : పోనీ వద్దులే - అద్సరేగాని మీనాన్నగారు వస్తే ఆయనతో ఏంమాట్లాడనూ? చెప్పు చెప్పు!

నవ : ఏం మాట్లాడతావూ? నమస్కారం పెట్టి నువ్వెవరివో పరిచయం చేసుకో

కాళీ : ఏమని పరిచయం చేసుకోనూ? చెప్పుబ్రదర్! నేను బీరుతో మా కుల సంప్రదాయానికి నీళ్లు వదిలేశానూ 'సోనాగాఛి'లో నాకు నూరుగురు మావగాళ్లు... ఊహూ... కాదు కాదు మావగార్లు కాదు-నూరుగురు అత్తగార్ల ఇళ్లు ఉన్నాయి. విల్సను అఖాడాలో నిత్యం మహాప్రసాదాన్ని పుచ్చుకుంటూ ఉంటానూ అని మీనాన్నగారికి చెప్పనా? అహహ- అహహ- అహహ.

నవ : అబ్బబ్బా! పనికి రాని వేళాకోళం మానేసి నిజంగా ఏం చెప్తావో చెప్పు. ఓపని చెయ్యి. నీకు ఎవరిదన్నా బాగా పేరున్న వైష్ణవ ఫామిలీ పేరు జ్ఞాపకం ఉందా? ఉన్నట్లయితే మరింకేం చెప్పాల్సిన అవసరం ఉండే ఉండదు.

కాళీ : ఎందుకు జ్ఞాపకం లేదూ! ముందు కాస్తంత మన్ను ఇయ్యి - ఒడియా భక్తుల్లా ముక్కుమీంచి నామపు బొట్టు పెట్టుకుని మొదట సాధువునై పోతా!

నవ : కాదు కాదు-అదికాదు (కొంచెం ఆలోచించి) గరాన్‌హాటాలో ఓ ఘోష్‌గారు గొప్ప వైష్ణవ భక్తులు ఉండేవారుకదా! ఆయన పేరు నీకు జ్ఞాపకం ఉందా? ఆయనేరా-ఆయన కొడుకు మనతో పాటే మన క్లాసులోనే చదువుతూ ఉండేవాడూ?

కాళీ : బ్రదర్ నాకయితే గరాన్‌హాటాలో ప్యారీ, దాని 'గుంటపాప' బిందో తప్ప ఇంకెవరూ తెలీదు.

నవ : ఏప్యారీ?

కాళీ : అబ్బ - గోదాప్యారీరా! అదేవిటీ? నీకు గోదా ప్యారీ తెలీదా? నేనూ మదనూ ఓరోజు దానింట్లో ఎంత మజా చేశామో! ఏంచెప్పనూ? సరిసర్లే - పోనీలే ఆసంగతి వదిలెయ్యి - నేనేంచెప్పాలో ఇప్పుడు దాన్ని నిర్ణయించు.

నవ : (కొంచెం ఆలోచించి) ఆ యిదైతే సరిగ్గా సరిపోతుంది! ఇదిగో కాళీ, మీమేనత్త మొగుడు ఒకాయన గొప్ప వైష్ణవ భక్తుడు కదా! ఆయన బృందావనంలో చచ్చిపోయాడు కదా!

కాళీ : అవునవును! ఓ ఓల్డ్‌ఫూల్ ఉండేవాడు! ఆయన పేరు కృష్ణప్రసాద్ ఘోష్!

నవ : మరింకేం? మహాబాగు! నువ్వు ఆయన సంగతి చెప్పి నిన్ను నువ్వు పరిచయం చేసుకో. మీనాన్నగారి పేరూ ఊసూ ఎత్తకు.

కాళీ : అహహ! అహహ!

నవ : పదరావెర్రిగాడా! నవ్వుతావెందుకూ?

కాళీ : అహహ! అహహ! సరిగ్గా నప్పిందనుకో! అయితే ఈ వైష్ణవ తంద్రులవి ఒకటిరెండు గ్రంథాలపేర్లు తెలిసి ఉంటేనే కాని పబ్బం గడవదను కుంటానే!

నవ : అదయితే అయినట్టే! ఈ విషయంలో నేను పరమ పండితుణ్ణి! ఉండు ఉండు. (కొంచెం ఆలోచించి) శ్రీమద్ భగవద్గీత... గీతగోవింద

కాళీ : గీత ఏమిటీ?

నవ : జయదేవుడి గీతగోవిందం.

కాళీ : అంటే శ్రీమతీ భగవతీగీత. బిందా దూదీ గీత

నవ : అహహ! అహహ! బ్రదర్‌ది ఎంత అపూర్వమైన మెమొరీవో!

కాళీ : ఏం? ఏమైంది?

నవ : నోర్మూసుకో - నాన్నగారు వస్తున్నారు. చూడూ కాస్త బాగా నమస్కారం చెయ్యి. (గృహస్థు వస్తాడు. కాళీ నమస్కారం చేస్తాడు.)

గృహస్థు : చిరంజీవీభవ! బాబూ నీ పేరేమిటీ?

కాళీ : నాపేరండి - శ్రీ కాళీనాథ్ దాస్ ఘోష్. మీకు కీర్తిశేషులు కృష్ణప్రసాద్ ఘోష్‌గారిని బహుశా తెలిసే ఉంటుంది. నేను వారి మేనల్లుణ్ణి.

గృహస్థు : ఏ కృష్ణ ప్రసాద్ ఘోష్‌గారూ?

కాళీ : బాంస్ బేడే వారండి.

గృహస్థు : ఓహోహో! నువ్వు ఆ కీర్తిశేషులు కృష్ణప్రసాద్ ఘోష్‌గారి మేనల్లుడివా? ఆయన బృందావన ప్రాప్తిపొందిన మహానుభావులు!

కాళీ : అవునండీ!

గృహస్థు : పదికాలాలపాటు చల్లగా జీవించు నాయనా! కూచో.
(అందరూ కూచుంటారు.) ఏంచేస్తూ ఉంటావు బాబూ!

కాళీ : నవకుమార్ బాబూ నేనూ కాలేజీలో ఒకే క్లాసులో చదువుకున్నామండీ, ప్రస్తుతం ఏదన్నా నౌకరీ కోసం ప్రయత్నం చేస్తున్నానండి.

గృహస్థు : మంచిది. శుభం బాబూ! మీమేనత్తగారి భర్తా నేనూ చాలా దగ్గర మిత్రులం. ఆ సంబంధం వల్ల నేను నీకు పెత్తండ్రినవుతాను! తెల్సా?

కాళీ : అలాగా అండీ!

గృహస్థు : (స్వగతం) ఆహా ఈ అబ్బాయి చూడ్డానికే కాదు స్వభావ రీత్యా కూడా గుణవంతుడే! అవునులే! అవక ఏమవుతాడూ? కృష్ణప్రసాద్ మేనల్లుడు కదా!

కాళీ : పెదనాన్నగారూ! నవకుమార్ అన్నగారిని ఇవాళ నాతోపాటు పంపించడానికి అనుమతించండి.

గృహస్థు : ఏంబాబూ? ఎక్కడికి వెళ్తారు?

కాళీ : మాది ఓ సంస్థ ఉందండి. జ్ఞానతరంగిణి అండి. ఆ సంస్థ మీటింగు ఇవాళ ఉందండి.

గృహస్థు : ఏ సంస్థ అన్నావు బాబూ?

కాళీ : జ్ఞాన తరంగిణి సంస్థ

గృహస్థు : ఆ సంస్థలో ఏమిటి చేస్తారూ?

కాళీ : కాలేజీలో మేం ఇంగ్లీషుమాత్రమే చదవడం రాయడం నేర్చుకున్నామండి. అయితే మన జాతీయ భాషని కూడా కొద్దో గొప్పో నేర్చుకోవాలి కదండీ! అందుకని మా సంస్థ సంస్కృత విద్య కోసం ఏర్పడిందండి. ప్రతి శనివారం మేం - ఈ సంస్థవాళ్లం కలుసుకుని ధర్మశాస్త్రాన్ని అధ్యయనం చేస్తామండి.

గృహస్థు : చాలామంచి పని చేస్తున్నారు! (స్వగతం) ఓహోహో మరి కృష్ణప్రసాద్ మేనల్లుడు కదా! ఈ నవకుమారుడైనా ఎవరు కనక! వాడు నా కొడుకు! (కాళీతో) మీ గురువు ఎవరుబాబూ!

కాళీ : కేనారామ్ వాచస్పతిగారండి. సంస్కృత కాలేజీలో ప్రధానోపాధ్యాయులు.

గృహస్థు : బాగుంది బాబూ బాగుంది! మీరంతా ఏ పుస్తకాన్ని అధ్యయనం చేస్తున్నారూ? చెప్పూ.

కాళీ : (స్వాగతం) చచ్చేన్రా దేవుడా! ఇంతసేపు లాక్కొచ్చినా ఇహ పట్టుపడి పోయేటట్టున్నాను! (గృహస్థుతో) శ్రీమత్ భగవత్‌గీత. బోపదేవ్ బిందాదూతీ

గృహస్థు : ఏమిటి ఏమిటన్నావు బాబూ!

నవ : వాడన్నాడూ - శ్రీమద్ భగవత్‌గీత, జయదేవుడి గీత గోవిందం.

గృహస్థు : జయదేవుడా? ఓహోహో! కవికుల తిలకుడు! భక్తిరస సముద్రుడు!

కాళీ : పెదనాన్నగారూ! మీరు అనుమతిస్తే మేం వెళ్లివస్తాం.

గృహస్థు : అరె, ఇంకా ఏదీ ఐదన్నా అవలేదు. ఇప్పట్నించీ వెళ్లి అక్కడేం చేస్తారూ?

కాళీ : పెందరాళే పని పూర్తి చెయ్యాలని మేం ముందుగా వెళ్లాలని అనుకుంటున్నాం. రాత్రి పొద్దుపోయేంత వరకూ ఉంటే ఆరోగ్యం చెడిపోతుంది. అందుకని మేం పెందరాళే 'మీట్' అవుతాం.

గృహస్థు : మీ సంస్థ మీటింగు ఎక్కడ అవుతుంది బాబూ!

కాళీ : సీక్‌దార్ పాడే వీధిలో

గృహస్థు : మంచిది బాబూ! అప్పుడప్పుడు వస్తూ ఉండు. చూడండీ - ఆలశ్యం చెయ్యకుండా తొందరగా వచ్చేయండి.

నవకుమార్ : అలాగేనండి.

కాళీ : (ఇద్దరూ వెళ్తారు.)

గృహస్థు : (స్వగతం) ఈ కలకత్తా పట్టణం చాలా చెడ్డది. కుర్రాణ్ణి ఒకణ్ణే పంపడం సరియైన పనేనా? (కొంచెం ఆలోచించి) ఓసారి బైరాగీ బాబాని పిలిపిస్తే సరి - చూసివస్తాడు సంగతేమిటో నా మనస్సేమిటో సందేహిస్తోంది! నవకుమార్‌ని పంపడం తప్పు అయిపోయినట్టు ఉంది! (వెళ్తాడు)

రెండవ గర్భాంకం

సీక్ దార్ పాడాస్ట్రీట్, బైరాగిబాబా వస్తాడు

బైరాగి బాబా : (స్వగతం) సీక్ దార పాడా వీధి ఇదే కదా! మరి అదేన నవకుమార్‌బాబు సంస్థ జరిపే మీటింగు ఇల్లు? రాధేకృష్ణ! రాధేకృష్ణ! (నాలుగు పక్కలా తిరిగి) ఊ, చూస్తాను. బహుశా ఈ ఇల్లేనేమో! (తలుపుకొడతాడు) (లోపల్నుంచి) ఏయ్? ఎవరది? ఎవరు కావాలి?

బైరాగిబాబా : ఏమండీ! జ్ఞానతరంగిణి సభ జరిగే యిల్లు యిదేనా అండీ?

(లోపల్నుంచి) : ఏయ్ ఫూంటీ! కాస్త వెళ్లిచూడవే! ఎవరో తాగుబోతు చచ్చినాడు తలుపుకొడుతున్నట్టున్నాడూ! వాణ్ణెత్తిని ఇన్ని నీళ్లుపొయ్యి!

బై.బా : (స్వగతం) ప్రభో తండ్రీ నీదయ! అయ్యొయ్యో! ఈ వయస్సులో తాగు బోతునయ్యానా? (లోపల్నుంచి) ఎవడివిరా! ఫో! ఇక్కణ్ణించి పోకపోయేవో చౌకీదార్‌ని పిలుస్తాను.

బై.బా : (గబుక్కున తిరిగి కోపం గొంతుతో) ఏంకష్టం వచ్చిందిరాతండ్రీ! రాధేకృష్ణ! రాధేకృష్ణ! అయ్యగారు మరో మనిషి వారి దగ్గర లేనట్టు నాకు ఈపని

పురమాయించి పంపించార్రా దేవుడా! (ఇలా అటూ తిరుగుతాడు) అదిగో ఎదురుగా ఎవడో పెద్దమనిషి వస్తున్నట్టున్నాడు! ఆయన్ని అడుగుతా.

(ఓతాగుబోతు వస్తాడు)

తాగుబోతు : (బైరాగి బాబాని చూసి) ఏమండీ! ఇక్కడికెక్కడికి వేంచేశారూ?

బై.బా : అయ్యా! నేనేం చెప్పేది?

తాగు : ఓహో, అయితే నువ్వు వేషం వేసుకుని వచ్చేవా?

బై.బా : రాధేకృష్ణ! రాధేకృష్ణ!

తాగు : అదే అయితే గాడిదనాకొడకా! ఇక్కడ నువ్వేం చేస్తున్నావురా! ఫోరా ఫో - గాడిదనాకొడకా!

(వెళ్లిపోతాడు)

బై.బా : దేవుడా! ఎలాంటి దుష్టుడ్రా బాబూ! రాధేకృష్ణ! రాధేకృష్ణ! ఈ వీధిలో మంచి మనిషన్నవాడు ఎవడన్నా అసలు ఉంటాడా? వీళ్లెవరు చెప్మా! (చూస్తూ) ఓహోహో ఆడమనుషులు వీళ్లిద్దరూ చూడ్డానికి ఫరవాలేకుండా ఉన్నారు. ఎవరో వీళ్లు? రాధేకృష్ణ! రాధేకృష్ణ! (ఏకదృష్టితో చూస్తాడు.)

(ఇద్దరు వేశ్యలు వెనక్కి తిరిగి చూస్తూ చూస్తూ వస్తారు.)

మొదటి వేశ్య: ఏమేవామా! ఆదౌర్భాగ్యుడి తెలివితేటలు చూశావా? మనతోపాటు వస్తూవస్తూ ఎటోవెళ్లిపోయాడు.

రెండోవేశ్య : తోవలో 'పద్ద' ఇంట్లోదూరి ఉంటాడు. నీ తలరాత బాగోలేదు. అందుకే ఆదౌర్భాగ్యుణ్ణి అట్టేపెట్టుకున్నావ్. నేనయితేనా ఎప్పుడో కాలితో ఓతాపు తన్ని అవతలికి గెంటేసేదాన్ని.

మొదటివేశ్య : ఉండుండు. అలా చూస్తూఉండు. ఇంటికి వెళ్లనీ. ఇవాళ వాడి భరతం పడతాను. ఏమనుకుంటున్నాడో వాడి మనసులోకి! ఎంతమందిని తైతక్కలాడించి వదిలిపెట్టలేదు ఇప్పటివరకూ! ముందు మదన మోహనని చూసివద్దాం పద. వచ్చేక వీడికి శ్రాద్ధం పెడతా.

రెండవవేశ్య : అలా చెయ్యగలిగితే ఇంక చెప్పేదేముంది? ఒసే థాకీ, వాడెవడే ముల్లాలాగ గోచీ జారిపోయి నిల్చున్నాడు? చూశావా?

మొదటివేశ్య : అవునేవ్! అవునేవ్! వాడెవడో ఇప్పుడు మన వేపే వస్తున్నాడు - వామా! వాడు ముల్లాకాడే! బైరాగి బాబా!చేతిలో
జపతావళం కూడా ఉంది! ఒహోహో అహహ - (నవ్వుతూ) వాడివాళకం చూడ్డూ - తులసివనంలో సింహంలాగ!

బైరాగిబాబా : (దగ్గరగావచ్చి) ఏమండీ! ఇక్కడ జ్ఞానతరంగిణి సంస్థ మీటింగు ఎక్కడవుందో మీకు తెలుసా? కాస్త చెపతారా?

రెండవవేశ్య : ఈ తరంగిణి ఎవరూ? (థాకీని పట్టుకుని నవ్వుతూ) బైరాగి బాబూ గారూ! తరంగిణి మీ వైష్ణవమ్మ పేరా??

మొదటి : ఓహో! బాబాగారూ! మీవైష్ణవమ్మ తప్పిపోయిందా? అయ్యోపాపం! ఇలా సందులూ గొందులు ఏడుస్తూ తిరుగుతున్నారా? తిరిగితే ఏంలాభం? అవ్వాల్సింది ఏదో అయిపోయింది. ఇంకేం చెయ్యగలరూ? మాతోపాటు వస్తానంటారా చెప్పండి. ఏమే వామా! వాళకపు వేషాన్ని తీసుకెళ్లగలవా?

రెండవ : ఎందుకు తీసుకెళ్లలేనూ? రూపాయి పావలా ఇస్తే తప్పకుండా తీసుకెళ్లగలను - ఏవంటారు బైరాగి బాబా గారూ?

మొదటి : ఇంకేమంటారు బైరాగి బాబా! పద గోవిందా అని పాడెగట్టి ఆయన్ని పట్టుకుపోదాం! గోవిందా!

బై.బా : (స్వగతం) ఇదెక్కడి ఆపదవచ్చిపడిందిరా దేవుడా! రాధేకృష్ణ! రాధేకృష్ణ! (గట్టిగా) లేదు తల్లీ లేదు. మీరు వెళ్లండి. నావల్ల తప్పు అయిపోయింది!

రెండవ : వెళ్తామండీ! అలాగే వెళ్తాం! మీకు ఆ తరంగిణి తప్ప ఇంకెవత్తి నచ్చుతుంది కనక! బాగు బాగు. వెళ్తున్నాం మీరు ఇక్కడే ఇలాగే ఏడుస్తూ పడి ఉండండి. (బైరాగి బాబా మొహం దగ్గరగా చెయ్యి ఆడించి) ఓ నా ప్రియమైన వైష్ణవీ! నామనస్సు దొంగిలించావే!
(ఇద్దరు వేశ్యలు వెళ్లిపోతారు)

బైరాగిబాబా : రామరామ! ఇదెక్కడి ఆపదవచ్చిపడింది! యివాళ నుదిటిన ఈ దుఃఖం యిలా రాసిపెట్టి ఉంది! ఆ సంస్థ ఎక్కడ! దాని మీటింగు ఎక్కడ? నాకు ఈ ఆపద దుఃఖం కలగాల్సి ఉంది! (ఇలా అటూ తిరుగుతూ) ఓవేళ ఏమీ తెలుసుకోకుండా ఈపట్టున యిలాగే వెళ్తే అయ్యగారికి కోపం వస్తుంది. మా మంచి ఇరకాటంలో చిక్కుకున్నాను. యిప్పుడేం చెయ్యనూ? (విచారంగా నిల్చుంటాడు.) (కాస్సేపయాక ఎదురుగా చూస్తాడు) ఓహో ఎవడో యిటువేపే వస్తున్నాడే! మహాబాగు. వాడి వెనకాతల, వెనకాతలే నిర్మలంగా బయటపడితే - అయ్యోరామా! వీడు సార్జెంటు బాబా! రౌండ్‌లకి వచ్చినట్టున్నాడు! చడీచప్పుడూ లేకుండా యిక్కడనిల్చుని ఉంటే దొంగాడ్ననుకొని పట్టుకుంటాడేమో! అయితే యిప్పుడు ఎక్కడికి వెళ్లనూ? (ఆలోచించి) ఇదేనయం! ఇలా చాటుగా దాక్కుని నిల్చుంటాను. అయ్యోరామా! ఆయన వచ్చేయే వచ్చేశాడు! (ఒక్క ఉదటున పరిగెట్టుకుని వెళ్తాడు)
(సార్జెంటూ చౌకీదారు వస్తారు. చౌకీదారు చేతిలో దీపం ఉంటుంది.)

సార్జెంటు : హల్లో చౌకీదార్! ఒహడెవరో హటువైపు పరిగెత్తుకెళ్లాడు కదూ!

చౌకీదార్ : లేదుసార్! నేను చూడ్లేదు.

సార్జెంటు : హెళ్లేడు! హెళ్లేడు! మేం చూసేం. నువ్వు హెంటనే పరిగెత్తుకెళ్లు. హటువైపు చూడు. హెళ్లు హెళ్లు. గబ్‌గబ్ వెళ్లు - యూ పిగ్! చౌకీదార్ (గబగబా రెండో వేపుకి వెళ్తూ వెళ్తూ, ఎవఢ్రా అది? ఆగు ఆగు. అక్కడే ఆగు.

సా : డేమ్ యుర్ ఆఇజ్. హిటు హిటు! యూ ఫూల్!

చౌ : (భయపడి) అలాగేసార్ ఇటు. ఇటు (పరిగెట్టుకుని వెళ్తాడు)

సా : (కోపంతో) ఓహ్హో - ఇఫ్ ఐకెన్ కేచ్ హిమ్ (లోపల్నుంచి) వస్తున్నాను బాబూ వస్తున్నాను. ఇంక కొట్టకు నాయినా కొట్టకు. దణ్ణంపెడ్తా, నీకాళ్లమీద పడ్డా. రక్షించు. (లోపల్నుంచి)దొంగ గాడిద నాకొడకా! నీనుంచి పరిగెట్టి పరిగెట్టి నా ప్రాణం పోయింది! (లోపల్నుంచి) ఊహూ ఊహూ కాను - నేను దొంగను కాను బాబూ! నేను వైష్ణవుణ్ణి నాయినా! (బైరాగి బాబాతో చౌకీదార్ వస్తాడు)

సార్జెంటు : దా! దా! నువ్వేనా దొంగనాకొడుకు!

బైరాగిబాబా : (గాభరాతో) కాదండీ సార్జెంటుగారూ - నాకేంతెలీదు! నేను బీ-బీ-బీ

సార్జెంటు : హేంగ్ యుర్ బీబీబీ - నోర్మూయ్యి. యుబడ్లీ నెగర్ - హేదీ సూపెట్టు నీ బేగ్‌లో హేమిటుంది? (బలవంతంగా జపతావళాన్ని లాక్కుని తన మెళ్లో వేసుకుంటాడు) అహహా! అహహా! బాబా రే బాబా! బలేబలే! మేం మా గొప్ప హిందూ హయ్యిపోయ్యాం. రాధే కసడే, అహహా! అహహా!

బైరాగిబాబా : (గాభరాతో) కాపాడండిసార్ బీదవైష్ణవుణ్ణి మహాప్రభూ రక్షించండి - దణ్ణాలు - నన్ను ఒదిలెయ్యండి. (వెళ్లబోతాడు)

చౌకీదార్ : ఆగరా దొంగ నాకొడకా!

బైరాగి బాబా : కంపెనీ సర్కారువారూ కాపాడండి. కాపాడండి.

సార్జెంటు : హోల్డ్ యుర్ టంగ్ యు బ్లేక్ బ్రూట్! ఈ బేగ్‌లో హింక హేమిటిన్నాయి? సూస్తాను (బలవంతంగా సంచీ లాక్కుంటాడు) (అందులోంచి 4 రూపాయిలు కిందపడతాయి)

సార్జెంటు : దెట్స్ రా ఇట్! యూ సూటీ డివిల్! హివడి దగ్గర దొంగతనం సేసేవు? (చౌకీదార్‌తో) వీణ్ణి ఠానాకి తీసుకు హెళ్లు!

బైరాగీబాబా : దణ్ణాలు దొరగారూ! కాపాడండయ్యా! నేను దొంగతనం చెయ్యలేదు. నన్ను వొదిలిపెట్టండి. ధర్మదేవతా! కాపాడండి. నాకా రూపాయలు వద్దు.

సార్జెంటు : హదేం కుదర్దు - నువ్వు ఠానాకి హెళ్లాల్సిందే! హేమిటి? హెళ్లవా? హెళ్లితీరాలి.

చౌకీదార్ : పదరా! పద ఠానాకి పద.

బైరాగి : కంపెనీ సర్కార్‌వారు రక్షించాలి! దణ్ణాలు దొరా దణ్ణాలు!నాకు డబ్బు అక్కర్లేదు. మీరు తీసేసుకోండి. మీకు తోచినట్టు చేసుకోండి. నన్ను మాత్రం విడిచిపెట్టండి.

సార్జెంటు : (నవ్వుతూ) హేవిటి? నీకుడబ్బు హెుద్దా? (రూపాయిలు జేబులో పెట్టుకుని చౌకీదార్‌తో) వెల్‌దెన్! హీడి తప్పు హేదీ నాకు అహుపడలేదు. హీడిని హొదిలెయ్యి.

బైరాగి : (సంబరంతో) జేజేలు మహాప్రభో!

చౌకీదార్ : (బైరాగితో వేరుగా) నువ్వు నాకేమీ ఇవ్వలేదు - సరేలే వెళ్లు, వెళ్లు.

బైరాగి : కాదు బాబూ! నేనోసారి జ్ఞాన తరంగిణి సభని చూసివెళ్తాను.

చౌకీదార్ : ఓహో - సరేసరే - అదిగో ఆఇంట్లో - మంచి జల్సా అయిన ఇల్లు. సరదాల ఇల్లు.

సార్జెంటు : హేయి చౌకీదార్ - డబ్బు ఇసయం - (పెదిమిల మీద వేలు పెట్టి చూపెడతాడు)

చౌకీదార్ : చిత్తం తమరు చెప్పినట్టే.

సార్జెంటు : మమ్ ఇజ్ ది వర్డ్ మయి బ్యాయ్! ఇహనడు.
(సార్జెంటూ చౌకీదార్ వెళ్లిపోతారు.)

బైరాగిబాబా : రాధేకృష్ణ! రాధేకృష్ణ! అమ్మయ్య!గండం గడిచింది! ఏ దుర్ముహూర్తంలో యింటి నుంచి బయటికి వచ్చానో! అదృష్టవశాత్తూ రూపాయిలు నాలుగు దగ్గరుండబట్టి సరిపోయింది! సార్జెంటుకీ చెయ్యి చాపే జబ్బే! దానివల్లే గండం గట్టెక్కింది! లేపోతే ఇవాళ కటకటాల్లో ఉండాల్సి వచ్చేదో ఏమయ్యేదో దేవుడు కూడా చెప్పలేడు! (హోటలు డబ్బాలు పట్టుకుని కూలివాళ్లు ఇద్దరు వస్తారు.) ఇదేమిటి? ఈ కంపేవిటి? రాధేకృష్ణ! రాధేకృష్ణ! ఈ దెయ్యాలమొహాలగాళ్లు ఏవిటి మోసుకువస్తున్నారూ! (అక్కడే నిలబడిపోతాడు)

మొదటికూలి : అబ్బా! దీంట్లో ఇవాళ ఎంత పెట్టారో లెక్కాపత్రం లేదు! నాభుజం విరిగిపోతోంది!

రెండవకూలి : చూడు మావా! ఈ హిందూ గాడిదకొడుకులు లోకంలో ఎన్ని సరదాలున్నాయో అన్నీ చేసుకుని జల్సాగా బతుకుతున్నారు. ఈ నాకొడుకుల మతమూ అలాంటిదే! మహామజాగా హాయిగా ఉంటుంది.

మొదటికూలి : పోరా మూర్ఖుడా! ఈ గాడిదనాకొడుకులకి మతమన్నా ఏడిసిందా అసలు! అటు అల్లానీ నమ్మరు - ఇటుదేవుణ్ణీ నమ్మరు!

రెండవకూలి : కానీ ఈ గొడ్డుమాంసం మెక్కేగాళ్ల డబ్బులతోనే మోగర్ పోంచ్ ఘర్ ఇంతలా పెరిగి పెద్దదయిపోయింది! సాయంత్రం అయీఅవడం ఈనాకొడుకులు గబ్బిలాల్లా గుంపులుగుంపులు వచ్చివాలతారు. ఎంత మెక్కుతారో ఎంత తాగుతారో ఎవడైనా చెప్పగలడా!

మొదటికూలి : ఏమయ్యోయ్ కాదిర్‌సాబ్! మేవిక్కడ రాత్రంతా పడిగాపులు పడి ఉండాలా ఏం? దర్వాన్ని పిలవయ్యా! ఏమయ్యోయ్ దర్వాన్! ఏడీ? ఆ పప్పుముద్ద మింగే ఆ నాకొడుకు? ఎక్కడ తగలడ్డాడు? ఏమయ్యోయ్ దర్వాన్! అయ్యా దర్వాన్ గారూ! (లోపల్నుంచి) ఎవర్రా అదీ?

మొదటికూలీ : మేం పోంచ్ ఘర్ కూలీలం.

(లోపల్నుంచి) : రండి లోపలకి రండి.

(కూలీలు లోపలికి వెళ్లిపోతారు)

బైరాగిబాబా : (ముందుకు వెళ్లి స్వగతం) ఎంత వింత! ఈ డబ్బాలన్నీ ఏవిటో! వీట్లో ఏమున్నాదో! ఛీఛీ థూథూ! రాధేకృష్ణ! రాధేకృష్ణ! ఈ జ్ఞాన తరంగిణి సభ ఏమిటో నాకేం బోధపడ్డంలేదు.

(లోపల్నుంచి) : మల్లిపూలు! మల్లిపూలు!

(లోపల్నుంచి) : ఐసు కావాలా అండీ ఐసు!

ఓమాలీ, ఐసుఅమ్మే కుర్రాడూవస్తారు.

మాలి : మల్లిపూలు! మల్లిపూలు! ఏమయ్యోయ్ దర్వాన్! బాబుగార్లు అందరూ వచ్చేశారా?

(లోపల్నుంచి) : లేదు. ఇంకా రాలేదు. కాస్సేపయాక రా!

ఐసువాడు : ఐసుకావాలాండీ! ఐసుకావాలా? దర్వానయ్యా!

(లోపల్నుంచి) : నువ్వూ కాస్సేపాగిరా!

(మాలీ, ఐసువాడూ వెళ్లిపోతారు)

బైరాగిబాబా : (స్వగతం) నాశనం! సర్వనాశనం! నాబుర్రకేం అర్థం అయి చావటంలేదు! (దూరంగా లోపల్నుంచి అమ్మేవేపు కేక వినిపిస్తుంది - మల్లిపువ్వులు మల్లిపువ్వులండి! ఐసు కావాలండీ ఐసు!)

(వాద్యగాళ్లతో నితంబిని, పయోధరి వస్తారు)

నితంబిని : నిన్న కాళీబాబు బ్రాందీ తాగించాడు. ఇప్పటికీ నా తల తిరుగుతోంది. ఇవాళ నేను ఎలా డాన్సు ఆడతానో ఏమిటో! బెంగగా ఉంది!

పయోధరి : నా ఇంటా నిన్న సదానందబాబు భేష్షైన సందడీ సరదా చేశాడు. ఈమధ్య సదానంద్ బాగా ఆరితేరేడు. బలేగా తయారయ్యేడు. అలాంటి నేస్తగాడైన మనిషి మరోడు దొరకడం కష్టమే!

వాద్యగాళ్లు : పదండి లోపలకి వెళ్దాం. ఏమయ్యోయ్ దర్వానయ్యా!

(లోపల్నుంచి) : ఎవరూ?

పయోధరి : ముందు తలుపు తియ్యవయ్యా! ఆతర్వాత ఎవరో అడుగుదువుగాని!

(లోపల్నుంచి) : ఓహో మీరా! రండి రండి.

(అందరూ వెళ్తారు)

బైరాగిబాబా : (ముందుకు వెళ్లి తనలో తాను) విచిత్రంగా ఉంది! వీళ్లేమో డాన్సింగ్ గర్ల్సలా ఉన్నారు! నాశనం! సర్వనాశనం! ఇప్పుడు అర్ధమవుతోంది! సంగతేమిటో! నవకుమార్ నిండా చెడిపోయాడు. అయ్యగారికీ విషయం తెలిసిందా కొంపమునుగుతుంది.

(నవకుమార్, కాళీబాబు వస్తారు)

నవకుమార్ : అహహా! అహహా! శ్రీమతీ భగవతీ గీత! నీది మహా అద్భుతమైన మెమోరీ! అహహా! అహహా!

కాళీబాబు : ఓహ్! ఆ కొరగాని చెత్తపుస్తకాలు నేనెప్పుడన్నా విప్పి చూశానా? చదివి ఏడిశానా? నాకు జ్ఞాపకం ఉండి చావడానికి!

నవకుమార్ : (బైరాగిబాబాని చూసి) ఇదేవిటి? ఆయన బైరాగి బాబాగారే! నేను చెప్పలేదా బ్రదర్ కాళీ! నాన్నగారు ఎవడ్నో ఒకణ్ణి నావెనకాతలే పంపించి తీరతారని! సరి, ఇతగాణ్ణి ముందస్తుగానే మనం చూడ్డం జరిగింది. మనం గొప్ప అదృష్టవంతులమే!

కాళీ : ఈ వైష్ణవ గాడిద కొడుక్కి కొంచెం ఫావుల్ కటలెట్టో మటన్ చాపో తినిపించమంటావా చెప్పు! ఇతగాడి జన్మ ధన్యమవుతుంది!

నవ : నోర్ముయ్యరా! నోర్ముయ్యి! ఇది హాస్యం వెటకారపు సంగతి కాదు. (ముందుకు వెళ్లి) ఓహో బైరాగిబాబా! మీరిటు వేంచేశారేమిటీ?

బైరాగి : ఏం లేదు! విశేషం ఏంలేదు! ఓ పనిమీద ఈవేపు నుంచి వెళ్తున్నాను. నవబాబుగారి సంస్థ మీటింగు ఓసారి చూసి వెళ్దామనిపించింది. అంతే!

నవ : మంచిది. బాగుంది. పదండి. లోపలకి పదండి.

కాళీ : (నవకుమార్‌తో వేరుగా) ఓరి ఏంచేస్తున్నావురా! పిచ్చాడా! ఇతగాణ్ణి లోపలికి తీసుకెళ్తే ఏమవుతుందో తెలీదా? మనమేం సంకీర్తనా భజనా చెయ్యడానికి వెళ్లటం లేదు!

నవ : (కాళీతో వేరుగా) ఓహో, మాట్లాడకు. ఊరుకో. (గట్టిగా బైరాగిని సంబోధిస్తూ) బైరాగిబాబా గారూ ఒక్కసారి మీ పాదం లోపల పెడితే ఎంతో బాగుంటుంది!

బైరాగి : లేదుబాబూ! నాకు వేరేపని ఉంది. మీరు వెళ్లండి (వెళ్లిపోతాడు)

కాళీ : గాడిద కొడుకుని పట్టుకుని నాలుగు వడ్డించమన్నావా చెప్పు!

నవ : దర్వాన్! ఓ దర్వాన్!

(దర్వాన్ వస్తాడు)

దర్వాన్ : అయ్యగారూ!

నవ : వీళ్లంతా వచ్చేశారా?

దర్వాన్ : వచ్చేరండి అయ్యా!

నవ : సరే నువ్వు వెళ్లు.

దర్వాన్ : చిత్తం అయ్యా!

(వెళ్తాడు)

నవ : బ్రదర్! ఇవాళ ఆబైరాగీ బాబాగాడు అంతా తలకిందులు చేశేటట్టు ఉన్నాడు. వీడు డాన్సింగ్ పాపలు లోపలకి వెళ్లడం చూశాడేమోనని నాకు భయంగా ఉంది.

కాళీ : ఛీఛీ నువ్వో పెద్ద కావర్డ్‌విరా! నీకు పిసరంతైనా మోరల్ కరేజ్‌లేదు! ఆనాకొడుక్కి భయపడ్తున్నావా? పదపద.

నవ : అబ్బే కాదు. కాదు కాదురా. బ్రదర్ నీకు ఇవేవీ అర్థంకావు. పద చూద్దాం. చెయ్యితడిపితే ఆదెయ్యంగాడి నోరుకట్టుడవుతుందేమో!

కాళీ : నాన్‌సెన్స్! దానికి బదులు ఆ నాకొడుకుని నాలుగు కిక్కులతో ఒకేసారి వైకుంఠానికి పంపించేస్తే పోదూ? డేమ్ ది బ్రూట్. ఈనాకొడుకులు ఈలోకంలో ఎవడికి కావాలి? వీడిదీ అన్నదేదన్నా 'మిసన్' ఉందా?

నవ : పదరా పిచ్చాడా! ఇది పిల్లకాయల ఆటకాదు. పద. మనం యిద్దరం అతగాడి దగ్గరికి వెళ్దాం.

(ఇద్దరూ వెళ్తారు)

మొదటి అంకం సమాప్తం

# రెండో అంకం

మొదటి గర్భాంకం

మీటింగు

(కొందరు పెద్దమనుషులు వస్తారు.)

చైతన్య : నవకుమారూ, కాళీ యివాళ యింత ఆలస్యం చేశారేం?

బాలాయి : నేనేలా చెప్పనూ? వదిలెయ్యి వాళ్లసంగతి! ప్రతీ విషయంలోనూవాళ్లు లీడ్ చెయ్యాలని చూస్తారు. వాళ్లు రాకపోతే ఏపనీ అవదని అనుకుంటారు!

శిబు : ఏమన్నా చెప్పు బ్రదర్! వాళ్లిద్దరూ బాగా చదువుకున్నవాళ్లు!

బలాయి : బిటివీన్ అవర్ సెల్వ్స్! అంత ఎక్కువ ఏం చదివేరయ్యా వాళ్లు!

మహేశ్ : ఇశ్ - ఆమాత్రం చదువు అందరికీ ఉంది! ఆవేళ నవకుమార్ ఉత్తరం రాశేడు చూశావుకదా! అందులో లిండలీ గాడికేం దుఃస్థితి పట్టిందో గుర్తుందిగా?

బలాయి : పైగాపెచ్చు దాని గురించి ఎంత ప్రవుడో! చూశావుకదా! కాళీ అయితే ఇహచెప్పనక్కర్లేదు! వీడిని మించి మరో మూరెడు!

చైతన్య : పోనీండిరా! మనఫ్రెండ్సువాళ్లు. ఇలాంటివి చెప్పుకుంటే ఏం ప్రయోజనం? వాళ్లు ప్రత్యేకించి ఉన్నారు కాబట్టే ఇవాల్టికి ఈ సంస్థనడుస్తోంది. ఆసంగతి తెలుసుకదా!

మహేష్ : ట్రూత్ చెప్పడానికి ఫ్రెండ్ ఏమిటి?

బలాయి : పోనీరా ఆ విషయం ఇహవదిలెయ్యి. మనమూ మెంబర్లం. వాళ్లిద్దరి కోసం వేట్ చెయ్యడం అవసరమా?

శిబు : నిజమే, మనకి కోరమ్ ఉన్నాది. మీటింగు ఎందుకు మొదలు పెట్టకూడదూ?

మహేశ్ : హియర్! హియర్! నేను ఈ మోషన్‌ని సెకండ్ చేస్తున్నాను.

బలాయి : అహహ! అహహ! దీనికి ఎవరికీ అబ్జక్షన్ లేనట్టే అనుకుంటున్నాను. 'నేమ్' ఎవరో! బ్రేవో! అహహ! అహహా!

మహేశ్ : (వాచీచూసి) తొమ్మిదవడానికి ఇంక ఐదు నిమిషాలే ఉన్నాది. నవకుమారూ, కాళీ ఇవాళ ఇంక వచ్చేటట్టు కనిపించడం లేదు! నేను చైతన్యబాబుని చెయర్‌మెన్‌గా ప్రపోజ్ చేస్తున్నాను.

అందరూ : హియర్! హియర్!

చైతన్య : (లేస్తూ) జెంటిల్ మన్! మీరు దయతో నాకు ఏపదవిని ఇచ్చారో ఆపదవి

పనిలో నాకు సాధ్యమైనంతవరకూ ఎలాంటి లోటూ రానివ్వను. నౌ టు బిజినెస్!

అందరూ : హియర్! హియర్! (చప్పట్లు కొడతారు)

చైతన్య : బట్లర్! బట్లర్! బేరర్!

(లోపల్నుంచి) : చిత్తం అయ్యా!

చైతన్య : రెండు బాటిల్సు బ్రాండీ, ఆపైన పొగాకూ పట్టుకురా (కూచుని) ఎవరికైనా బీరు తాగాలని ఉంటే చెప్పండి.

బలాయి : ఇలాంటి సమయంలో ఏగాడిద బీరు తాగుతాడు!

అందరూ : హియర్! హియర్!

(బట్లరూ, బేరర్ బ్రాండీ, పొగాకు పట్టుకుని వస్తారు)

చైతన్య : అందరికీ బ్రాండీ ఇయ్యి. (అందరూ తాగుతారు) బాటిలూగ్లాసులూ అన్నిటినీ ఇక్కడే ఉంచు.

బట్లరు : మంచిది అయ్యా!

(బాటిలూ మొదలైనవి అక్కడ పెట్టి వెళ్తాడు)

చైతన్య : బేరా! ఆడాన్సింగు గల్స్‌ని పిల్చుకురా ఆ కాస్తంత ఐస్ కూడా తీసుకురా!

బేరర్ : చిత్తం అయ్యా! (వెళ్తాడు)

బలాయి : నేను మన కొత్త చెయిర్‌మన్‌కి హెల్త్ కోసం కోరుకుంటున్నాను.

అందరూ : హియర్! హియర్! (బ్రాండీ తాగి) హిప్‌హిప్ హుర్రే హుర్రే!

(నితంబినీ, పయోధరీ, వాద్యగాళ్లు వస్తారు)

చైతన్య : రండి. రండి. కూచోండి. ఏం? గుర్తుపట్టేవా?

(అంతా కూర్చుంటారు)

నితంబిని : మీరెలా ఉంచుకున్నారో అలాగే ఉన్నాను.

చైతన్య : నేను నిన్నెక్కడ ఉంచుకున్నాను! నాకంత అదృష్టం ఎక్కడ!

అందరూ : బ్రావో! (చప్పట్లు కొడతారు)

చైతన్య : ఏయ్! పయోధరీ! ఇలా ఇక్కడికి వచ్చి కూచుందూ!

పయోధరి : ఉహూ. నేనిక్కడ బాగానే ఉన్నాను. కూచున్నాను!

చైతన్య : బలాయిబాబూ! వీళ్లకీ తాగడానికి ఇయ్యి! (డాన్సింగ్ గల్స్‌తో) ఇదిగో తీసుకోండి! రండి తీసుకోండి! (అందరూ బ్రాండీ తాగుతారు)

శిబు : (నాలుగోవాడితో) ఏయ్‌గాడిదా! నిద్రపోతున్నావేంట్రా?

మహేశ్ : (ఆవలిస్తూ) లేదు - లేదే! ఎందుకు నిద్రోతాను? నవకుమార్ రాలేదు. నిజంగానే రాలేదుకదా!

అందరూ : బ్రావో! బ్రావో!

చైతన్య : (పయోధరి చెయ్యిపట్టుకుంటూ) ఏదన్నా పాడుమరి!

పయోధరి : కాస్త సేపయాక తర్వాత పాడితే బాగుంటుంది కద!

చైతన్య : ఉహూ తర్వాతేమిటీ? మంచిపనికి ఆలస్యం కూడదు.

పయోధరి : సరే. అలాగే అంటే మరీ మంచిది. పాడతాను!

ఎవతి చెలిమి నెరపితివో
ఎవతి రుచులు మరిగితివో
మమ్ము మరిచితివో!
పగలు రేలు కనుల నీరు
కరిగిమరిగి ఎటుపోదుము
పాతపలుకు పరగడుపా
కరుణ లేక చెలులనొదిలి
కొత్త పొంగు వయసు సొబగు
భ్రమలపడి మురిసితివో
మమ్ము మరిచితివో
మమ్ము మరిచితివో!

అందరూ : ఓహో, ఆహా ఎంత బాగా పాడేవు! వారెవా! బహుకాలం బతుకు! బహుకాలం బతుకు!

చైతన్య : ఏయ్ బలాయి బాబూ! నువ్వేం సాకీవయ్యా!

బలాయి : ~~ఈ~~సాకీ ఏమిటీ? సాకీ అంటే?

చైతన్య : మదిరని ఇచ్చేవాణ్ణి ఫారసీలో సాకీ అంటారు.

శిబు : (పాడుతూ) 'నేస్తం లేడా పోనీలే సాకీ...

(అంతా తాగుతారు)

చైతన్య : కాస్త నోరుమూస్తావా? ఎవరో వస్తున్నట్టున్నారు!

బలాయి : నవకుమారూ కాళీలేమో!

(నవకుమారూ, కాళీ వస్తారు)

అందరూ : (లేస్తూ) హిప్ హిప్ హుర్రే హుర్రే!

కాళీ : (ఉన్మత్తంగా) హుర్రే! హుర్రే!

నవకుమార్ : కూచోండి బ్రదర్స్! కూచోండి అందరూ!

(అంతా కూచుంటారు.)

: ఇవాళ మమ్మల్ని ఎక్స్క్యూజ్ చెయ్యాలి. మాకో పని పడింది. అంచేత రావడం ఆలస్యం అయింది.

శిబు : (నిషాతో) 'దట్స్ ఎ లాయీ!'

నవకుమార్ : (కోపంతో) వాట్? నువ్వు నన్ను లయర్ అంటున్నావా? ఇప్పుడే నిన్ను నేను షూట్ చేసి పారేస్తానని నీకు తెలీటం లేదు!

చైతన్య : (నవకుమార్‌ని పట్టుకుని కూచోపెడతూ) అయ్యో! అయ్యో! పోనీరా, పోనీ! వదిలెయ్యి! ఏదో ట్రయఫిలింగు మాట పట్టుకుని అనవసరంగా దెబ్బలాట పెట్టుకుంటావెందుకూ?

నవకుమార్ : ట్రయఫిలింగ్! వాడునన్ను లయర్ అన్నాడు! అది ట్రయఫిలింగ్? వాడు బెంగాలీవాడిలాగ ఎందుకు నన్ను అన్నాడు కాదు! మిథ్యావాదిని అనొచ్చుగా! మరి అలాంటప్పుడు ఎవడికి కోపం రాదు? లయర్..!! ఇది భరించి ఊరుకునే విషయమా?

చైతన్య : అరెరె - పోనీలేరా! వదిలీరా! ఇంకా విషయం మెన్షను చెయ్యకు! (కూచోపెడతాడు)

నవకుమార్ : ఏం పయోధరీ! నితంబినీ! బావున్నారా?

పయోధరి : మేవయితే బావున్నాం! మీరే బాగున్నట్టుగా లేరు. కాస్త చల్లబడితే శాంతిగా ఉంటుంది.

నవకుమార్ : నేను చల్లగానే ఉన్నాను. ఇహ ఇప్పుడు కాస్త వేడెక్కాలి! ఏయ్ బలాయీ ఏదీ బ్రాండీ యిలా యియ్యి!

అందరూ : ఏయ్ ఇటు. ఇటు- మమ్మల్ని వదిలేద్దామనా? ఇటూ యియ్యి - (అందరూ కలిసితాగుతారు)

నవకుమార్ : కాళీ! నువ్వు నోరుమెదపకుండా కూచున్నావే!

కాళీ : నేనా వైష్ణవగాడిదకొడుకు ప్రవర్తనని చూసి నిండా విస్తుపోయాను. ఆగాడిద ఓపక్క తావళం తిప్పుతూ నామజపం చేస్తాడు - ఇంకో పక్క లంచం తిని అబద్ధం ఆడడానికి సిద్ధపడిపోయాడు. ఎంత హిపోక్రేట్! గాడిద కొడుకు!

నవకుమార్ : చావనిద్దూ! వాడిగోల వదిలెయ్యి! ఏయ్ పయోధరీ! నువ్వు లేమరి! ఆడు! నాట్యం ఆడు!

అందరూ : ఉహూ నాట్యం కాదు. కాదు కాదు ముందునీ స్పీచ్!

నవకుమార్ : (లేస్తూ) సరేసరే! జెంటిల్‌మెన్! మీరంతా ఈగోడ వేపోసారి చూడండి. దీనిమీద రాసిన అక్షరాల్ని కలిపి చదివితే జ్ఞానతరంగిణి సంస్థ అవుతుంది!

అందరూ : హియర్! హియర్!

నవకుమార్ : జెంటిల్‌మెన్! ఈ సంస్థపేరు జ్ఞాన తరంగిణి. మనం అందరం ఇందులో సభ్యులం. మనమందరం ఇక్కడ 'మీట్' అయి జ్ఞానం కలిగే పనే చేస్తాం

ఎండ్ వి ఆర్ జాలీ గుడ్ ఫెలోజ్!

అందరూ : హియర్! హియర్! వి ఆర్ జాలీ గుడ్ ఫెలోజ్!

నవకుమార్ : జెంటిల్‌మెన్! మనం అందరం హిందూ కులంలో పుట్టేం. అయితేనేం మనం మన విద్యాబలంతో సుపరస్టిశన్ సంకెళ్లని తెంచుకుని ఫ్రీ అయ్యేం. మనం విగ్రహాల్ని చూసి సాష్టాంగం పడడాన్ని ఇప్పుడు అంగీకరించం. జ్ఞానం అనే వెలుతురుతో అజ్ఞానం అనే చీకటి పటాపంచలైంది. మీరందరూ మనఃప్రాణాల్ని పెట్టి ప్రయత్నించాలనీ, దాంతో మనదేశంలో సోషల్ రిఫార్మేశన్ అవాలని మిమ్మల్ని నేను ప్రార్థిస్తున్నాను.

అందరూ : హియర్! హియర్!

నవకుమార్ : జెంటిల్‌మెన్! ఆడపిల్లలని ఎజుకేట్ చెయ్యండి. వారికి స్వేచ్ఛనియ్యండి. జాతి భేదాల్ని త్యజించండి! విధవలకిపెళ్లి చెయ్యండి. అలా అయితేనే - కేవలం అలా అయితేనే మన ప్రియమైన భరతభూమి ఇంగ్లండు యిత్యాది నాగరిక దేశాలతో పోటీపడకలదు.

అందరూ : హియర్! హియర్!

నవకుమార్ : జెంటిల్‌మెన్! ప్రస్థుతం ఈదేశం మనందరికి ఓపెద్ద జైలులాంటిది. ఇదిగో ఈ యిల్లు - ఈ యిల్లు మాత్రమే మన లిబర్టీ హాలు! స్వేచ్ఛా స్వాతంత్ర్యాల సావిడి! ఇక్కడ ఎవడికి ఏది ఇష్టమైతే అది చెయ్యవచ్చు. అది వాడు చెయ్యకలుగుతాడు! జెంటిల్‌మేన్! ఇన్ ది నేమ్ ఆఫ్ ఫ్రీడమ్ లెట్ అజ్ ఎంజాయ్ అవర్ సెల్వ్జ్! (కూచుంటాడు)

అందరూ : హిప్ హిప్ హుర్రే హుర్రే - ర్రే - ర్రే స్వేచ్ఛాస్వాతంత్ర్యాల సావిడి! లిబర్టీ హాల్! బి ఫ్రీ! లెట్ అజ్ ఎంజాయ్ అవర్ సెల్వ్జ్!

నవకుమార్ : ఓ బలాయీ! ఇంకోసారి అందరికీ అందియ్యవయ్యా!

బలాయి : అలాగే! అలాగే! ఇదిగో - ఇదండి. పుచ్చుకోండి.

(అందరూ తాగుతారు.)

నవకుమార్ : ఇహ డాన్సు మొదలుపెట్టాలి! కమ్ ఓపెన్ ది బాల్ మై బ్యూటీస్!

(పయోధరి, నితంబిని డాన్సుచేస్తూ పాడతారు)

హాయి! హాయి! ఓహోహో ఏమని పొగడాలి! కలకాలం బతకండి. కలకాలం బతకండి.

కాళీ : హుర్రే! జ్ఞానతరంగిణి సంస్థా ఫర్ ఐవర్

(చప్పట్లు కొడతారు.)

నవకుమార్ : లేవండి బ్రదర్స్! ఇహ సపర్ టేబిల్ దగ్గరికి పదండి!

చైతన్య : (లేస్తూ) త్రీ ఛియర్స్ ఫార్ అవర్ చైయర్‌మెన్!
అందరూ : హిప్ హిప్ హుర్రే - ర్రే-ర్రే.
నవకుమార్ : పయోధరీ! నువు నా 'ఆమ్' పట్టుకో.
పయోధరి : నీది ఏది పట్టుకోవాలీ?
నవకుమార్ : రా, నా చెయ్యి పట్టుకో
కాళీ : ఏయ్ నితంబినీ! నువ్వు నాకు ఫేవర్ చెయ్యి. అహహ! అహహా! ఎంత మెత్తని చెయ్యి!
అందరూ : బ్రావో! (చప్పట్లు కొడతారు)

(వాద్యగాళ్లు తప్ప అందరూ వెళ్తారు.)

తబలావాడు: ఓ భాయీ! చూడు ఆ బాటిల్లో ఏమన్నా కొంచెం ఉందేమో!
సారంగివాడు: చూడమన్నావా? ఆహా! ఉన్నాది! ఉన్నాది! ఇదిగో ఇంద.

(ఇద్దరూ తాగుతారు)

తబలావాడు: సరుకు మా శ్రేష్టమైనది! హాయి! హాయి!
లోపల్నుంచి : హిప్ హిప్ హుర్రే -ర్రే-ర్రే.
తబలావాడు: పదండి. ఎక్కడన్నా గంజాయి చిలుం దొరుకుతుందేమో! ఈ బ్రాండీ మనకు నప్పదు! దీంతో మన పని జరగదు!

(వెళ్తారు.)

## రెండవ గర్భాంకం

### నవకుమార్ బాబు పడగ్గది.

ప్రసన్నమయి, నృత్యకాళి, హరకామిని కూర్చుని ఉంటారు.

ప్రసన్నమయి : ఇదిగో! తీసుకో!
నృత్యకాళి : ఏమిటి ఆడేవ్?
ప్రసన్నమయి : కళావరు పది
నృత్యకాళి : జడ్డీ! కళావరు తురుపే. తురుపు ముక్క పడేసేవ్!
ప్రసన్నమయి : అవునూ పడేసేను. అయితే ఏంటిట! అంత చెత్తగా వాగుతున్నావ్! చేతిలో తురుపులేకపోతే పాస్‌ముక్క పడేయి!
నృత్యకేళి : మరీమంచిది. ఇదిగో నేను ఆసువేశా!
హరకామిని : దీన్ని తీసుకో!
నృత్యకాళి : ఇదేవిటి? పాస్ పడేసేవ్!
హరకామిని : చేతిలో తురుపు లేకపోతే పాస్ పడెయ్యక మరేం చేస్తాను!

నృత్యకాళి : ఏయ్ కమలా! నీదీ ఆట!

కమల : ఇదిగో! రాణీ!

నృత్యకాళి : అయ్యోరామా! మన చేతి ఆటే ఇదీ! నువ్వు రాణీ పడేశావేంటీ?

కమల : మరీ చెప్తావ్! రాణీ వెయ్యక ఏంచెయ్యనూ? రాజు ఎక్కడున్నాదీ?

నృత్యకాళి : రాజు నాదగ్గర ఉన్నాది.

కమల : అది నాకేం తెల్సూ?

నృత్యకాళి : పోవే ఫో - ఆట ఎటు వెళ్తోందో కాస్తన్నా అర్థం చేసుకోవు. నీలాంటి జడ్డిది మరొత్తి ఉండదు! నీకు పేక ఆడ్డం రాకపోతే ఆడ్డానికి ఎందుకు కూచుంటావ్?

కమల : అదేంటీ? ఆడ్డం ఎందుకు రాదూ?

నృత్యకాళి : దీన్ని ఆడ్డం అంటారా? నా ఆసుమీదే రాణీని పడేసేవ్!

కమల : ఏంటినువ్వనేది? రాణిని కోసేస్తే బాగుంటుంది కాబోలు!

హారకామిని : ఏవిటర్రాబాబు! ఉత్తిపుణ్ణేనికి కంగాళీ చేస్తున్నారు!

నృత్యకాళి : (కమలతో) ఏంఇబ్బందిట! రాజు నా చేతిలో ఉన్నాదికదా! నువ్వెందుకు భయపడ్డం!

కమల : నీ బుర్ర చెడిపోయిందా ఏం? నీచేతిలో రాజు ఉందని నాకెలా తెలుస్తుందీ!

నృత్యకాళి : నీక్కాస్తన్నా పేక ఆడ్డం అన్నది తెలిస్తే తప్పకుండా తెలిసిఉండేది!

కమల : ప్రసన్నా వింటున్నావా? దీనిమాటలు! అలా ఎలా అవుతుంది చెప్పు! రాణీని పట్టుకునే ఆటలో రాణీని కాపాడే అవకాశం దొరికితే ఎవరన్నా ఆ అవకాశాన్ని వదిలేస్తారా?

(లోపల్నుంచి) : ఏయ్ ప్రసన్నా!

ప్రసన్నమయి : హుష్! మాట్లాడకండి! అమ్మ పిలుస్తున్నట్టుంది!

(లోపల్నుంచి) : కోడలు పిల్లా!

ప్రసన్నమయి : (పెద్దగొంతుతో) ఏమిటమ్మా!

లోపల్నుంచి : మీరక్కడ ఏం చేస్తున్నారూ?

ప్రసన్నమయి : (పెద్దగొంతుతో) మేమా అమ్మా! అన్నయ్య పరుపూ పక్కా సరిగ్గా వేస్తున్నాం!

హారకామిని : ఇంకసరి! అమ్మడూ! పేకని ఎక్కడన్నా దాచెయ్యి. అత్తయ్యగారు చూసేరంటే అయింది మనపని!

ప్రసన్నమయి : (పేకని తలగడాకింద దాచేస్తూ) పట్టండి. మనం నలుగురం కలిసి ఈ దుప్పటీని దులపడం మొదలెడదాం. ఇహప్పుడు అమ్మకి ఏంతెలీదు!

నృత్యకాళి : చచ్చేనే! మరి ఆసు...

కమల : అయితే మాత్రం ఏమైంది? రాజురాణీని పట్టుకోలేడా?

హరకామిని : మీకాళ్లుపట్టుకుంటాను. మాట్లాడకుండా ఉంటారా? చూడండి. అత్తయ్యగారు మేడమీదికి వచ్చేస్తున్నారు. పట్టుకోండి. ఈదుప్పటీని పట్టుకోండి.

(గృహిణి వస్తుంది)

గృహిణి : ఏమర్రా! ఏంచేస్తున్నారిక్కడ!

ప్రస్నమయి : అన్నయ్య పక్క సరిచేస్తున్నాం అమ్మా!

గృహిణి : అయ్యో మా తల్లీ! సాయంత్రం నుంచి ఇప్పటి వరకూ మీరు పక్క వేస్తూనే ఉన్నారా? అవును లెండి - వెయ్యండి. పూర్తి ఎలా అవుతుందీ! అందరికందరూ కలియుగపు ఆడపిల్లలాయె!

నృత్యకాళి : ఏంటి దొడ్డమ్మా! మేం కలియుగపు ఆడపిల్లలమా?

గృహిణి : కనిపించడంలేదూ? మీరు బద్దకిష్టుల్లోకెల్లా మహా బద్దకిష్టులై కూచున్నారు! అదృష్టం బాగుండి నవకుమార్ ఇంట్లో లేడు. లేపోతే ఈపాటికి పడుకోవడానికి వచ్చేవాడే.

ప్రసన్నమయి : అమ్మా! అన్నయ్య ఇవాళ ఎక్కడికి వెళ్లాడూ?

గృహిణి : ఆ అదీ ఆ రామమోహన్‌రాయ్-కాదు కాదు-ఎవరిదో-ఏ సంస్థ చెప్మా!

కమల : ఓహో! చిన్నన్నయ్య వాళ్ల జ్ఞాన తరంగిణి సంస్థ మీటింగుకి వెళ్లేడా?

హరకామిని : (ప్రసన్నమయితో వేరుగా) అయితే మరి అయినట్టే! బాగుబాగు మరీ బాగు అమ్మడూ! ఇవాళ నువ్వు సంతోషంతో గెంతులు వెయ్యాల్సిందే! చూస్తూఉండు! ఇవాళా మీ అన్నయ్య వచ్చి ఆవేళ్లాగానే మజా చెయ్యొచ్చు.

గృహిణి : కోడలుపిల్ల ఏమంటోంది ప్రసన్నా!

(లోపల్నుంచి) : ఏయ్ బేమోల్! అమ్మగారు ఎక్కడున్నారూ? అయ్యగారు సావిడి గదిలోంచి లేచేరు!

గృహిణి : నే వెళ్లాలయితే! మీరు ఆపక్క సరిగ్గా వేసేసి వేగిరం కిందకి రండి. (వెళ్తుంది)

హరకామిని : (నవ్వుతూ) ఏమండీ అమ్మడుగారూ! మీ అన్నయ్య ఆవేళ ఏంచేశారో చెప్పు!

ప్రసన్నమయి : ఛీ ఛీ!

నృత్యకాళి : ఏవిటేవిటి? ఏంచేశాడుట! చెప్పవేంటి? చెప్పు! చెప్పు!

హరకామిని : (నవ్వుతూ) చెప్పు అమ్మడూ!

ప్రసన్నమయి : ఇలానన్ను పెద్దగా అల్లరి పెడితే ఇక్కణ్ణించి నేను వెళ్లిపోతాను.

నృత్యకాళి : ఏం? ఏమైందో చెప్పకూడదా! అలా అయితే కోడలు పిల్లనే చెప్పమంటాం. చెప్పు హరకామినీ నువ్వే చెప్పెయ్యి.

హరకామిని : చెప్పెయ్యనా? ఆవేళ వీళ్లన్నయ్య జ్ఞానతరంగిణి మీటింగు నుంచి తిరిగి వచ్చేరా -వస్తూనే అమ్మడ్ని చూసి ఒక్క ఉదుటున పట్టుకుని ముద్దు పెట్టుకున్నారు! అమ్మడు పారిపోబోతూ ఉంటే ఏమన్నారో తెల్సా? ఇందులో తప్పేముందీ! దొరలు అప్పచెల్లిల్ల బుగ్గలు ముద్దుపెట్టు కుంటారు నేనూ అలా చేస్తే తప్పయిపోయిందా ఏం? అన్నారు.

ప్రసన్నమయి : ఛీ ఛీ ఒదినా! ఇంక ఆపుదూ!

నృత్యకాళి : ఛీఛీ - ఇంగ్లీషు చదువులు చదివితే జనాలు ఇంతలాగ సిగ్గూ లజ్జా లేకుండా తయారవుతారు! ఇంకా అయిపోలేదు - పూర్తిగా విను! ఈ దొర బాబుగారు ఏమన్నారో!

ప్రసన్నమయి : మీ అన్నయ్యా బ్రాండీ తాగితే ఏంచేస్తారో దాన్ని చెప్పు!

హరకామిని : మా అన్నయ్యా! ఆయన ఎప్పుడూ జ్ఞానతరంగిణి మీటింగులకీ వెళ్లడు. ఇంకేమన్నా చెయ్యనీ కానీ స్వంత చెల్లిని ఒంటిమీద చెయ్యి వెయ్యడు! ఏది ఏమైతే ఏం కాని అమ్మడూ! నువ్వు మీ అన్నయ్య అడిగిందానికి ఒప్పుకోవెందుకూ? కాదూ కూడదూ అంటే నేను నా పుట్టింటికి వెళ్లిపోతాను. ఎలాగా నీభర్త నిన్ను ఒక మారంటే ఒక్కమారైనా తలుచు కోవడం లేదూ! అలాంటప్పుడు మీ అన్నయ్యేనయం!

ప్రసన్నమయి : మరేమరే - నువ్వూ మీ అన్నయ్యతో తిరుగు!

(లోపల్నుంచి) : వదలండి నన్ను!

లోపల్నుంచి) : మీకాళ్లుపట్టుకుంటాను. చిన్న అయ్యగారూ! అంత నోరుచేసి మాట్లాడకండి. పెద్ద అయ్యగారు ఆగదిలో భోంచేస్తున్నారు!

(లోపల్నుంచి) : డేమ్ పెద్ద అయ్య! నేనెవరికైనా లక్ష్యపెడతానా?

కమల : అదిగో చిన్నన్నయ్య వచ్చేశాడు!

నృత్యకాళి : రండర్రా రండి. మనం చాటుని దాక్కుని తమాషా చూద్దాం.

హరకామిని : (గట్టిగా నిట్టూరుస్తూ) ఏం బాగోలేదు! ఇదేం నాకు బాగోటంలేదు. అబ్బబ్బా ఇహరాత్రిరాత్రంతా నోటంట సారాకంపు ఉల్లికంపు దారుణంగా ఉంటుంది. దానికితోడు గుర్రు! అంతపెద్దగా గుర్రు! చచ్చినమనిషి కూడా లేచి కూచుంటాడు! ఛీ! ఛీ!

కమల : రండి. రండి. (అందరూ చాటుగా దాక్కుని నిల్చుంటారు)

(నవకుమార్‌బాబుని తీసుకుని వైద్యనాథ్ వస్తాడు)

నవకుమార్ : (బ్రాండీ నిశాలో) వైదే మై గుడ్ ఫెలో! నిన్ను నేను రిఫార్మ్ చెయ్యాలను కుంటున్నాను. బోధపడిందా?

వైద్యనాథ్ : చిత్తం అయ్యా!

నవకుమార్ : వైదే - ఓ బీరు - ఉహూ ఓ బ్రాండీ తే!

వైద్యనాథ్ : చిత్తం మీరు వెళ్లి ఆ పక్కమీద పడుకోండి. నేను బ్రాండీ తెచ్చి పెడ్తాను. (స్వగతం) చిన్న అయ్యగారు వేగిరంగా నిద్రపోకపోతే ఇవాళ ఇదో ఓ గొడవ జరిగేటట్టే కనపడుతోంది! పెద్దయ్యగారు ఈయన్ని ఇలా చూస్తే ఇంకేమన్నా ఉందా?

నవకుమార్ : (పక్కమీద కూచుంటూ) తే - బ్రాండీ తీసుకురా. వేగిరం!

వైదే : అయ్యా! ఇప్పుడే తెస్తాను. (వెళ్తాడు)

నవకుమార్ : (స్వగతం) డేమ్ నాన్నగారు! ఓల్డ్‌ఫూల్! ఇంకెన్నాళ్లు బతుకుతాడు? నా ఒంట్లో ప్రాణం ఉండగా నేను ఈ సంస్థని వదిలి పెట్టలేను! ముసిలాడు ఎలాగో కన్నుమూస్తే ఇంకే గాడిదకొడుక్కి దమ్ము ఉంటుంది? నన్నేమన్నా అనడానికి! అహహ! అహహ! యేంటీ ఆఈ ఎంజాయ్ మిసెల్ఫ్? (అరుస్తాడు) తే - బ్రాండీ పట్టుకురా!

హరకామిని : (కొంచెం ముందుకి వచ్చి) చచ్చే చావే వచ్చింది అమ్మడూ!

ప్రసన్నమయి : (కొంచెం ముందుకువచ్చి) ఏమిటీ?

హరకామిని : అటు చూస్తే మీనాన్నగారు అమ్మగారు గదిలో భోంచెయ్యడానికి కూచున్నారు!

ప్రసన్నమయి : అయితే నేనేం చెయ్యనూ?

హరకామిని : నువ్వు కాస్తంత దగ్గరగా వెళ్లి మీ అన్నయ్యని మాట్లాడకుండా అలా పడి ఉండమని చెప్పవూ?

ప్రసన్నమయి : (భయపడ్తూ) అమ్మో! నావల్లకాదు బాబోయి!

హరకామిని : (నవ్వుతూ) అహహా! ఇందులో తప్పేముందీ! నువ్వేమీ కూచి పాపవి ఏం కాదుగా! మగపిల్లల మొహం చూడగానే బెదిరిపోడానికి! వెళ్దూ కాస్త!

నవకుమార్ : తే! బ్రాండీ తీసుకురా!

హరకామిని : అయ్యబాబోయ్! చచ్చేం! (ఇంకాస్త ముందుకు వచ్చి) ఏమండీ ఏంటిది! మీనాన్నగారు భోంచేస్తున్నారు! ఇంట్లోనే ఉన్నారు! తెల్సా!

నవకుమార్ : (తుళ్లిపడి) ఏమిటిది? పయోధరీ! దా! దా! నాలాంటి పనికి మాలినవాణ్ణి నువ్వింత ఇదిగా ప్రేమిస్తున్నావా? ఎన్నెన్నో ఇబ్బందులు పడి ఇంత రాత్రివేళ ఈ కుంజవనంలోక వచ్చేవా? హహహ! అహహా! రా! రా!

(లేస్తాడు)

హరకామిని : అమ్మెడూ! ఏం వాగుతున్నారో ఏమిటో నాకేం బోధపట్టం లేదు.

ప్రసన్నమయి : (నవ్వుతూ) ఇది మీ ఉభయులమధ్య సంభాషణాయిరి! దాన్ని నేనేం అర్థం చేసుకోగలనూ?

నవకుమార్ : (చుట్టూతా తిరుగుతూ) రా పయోధరీ! నేను నీ డేమ్ స్లేవ్‌ని! రా! (కిందపడిపోతాడు)

(హరకామిని, ప్రసన్నమయి మిగిలిన అందరూ గభాల్న ముందుకు వస్తారు)

అందరూ : అయ్యోయ్యో! ఏమిటిది? అయ్యోయ్యో (ఏడుస్తారు)

లోపల్నుంచి : ఏమైంది? ఏమైంది?

(గృహిణి వస్తుంది)

గృహిణి : (నవకుమార్‌ని చూసి) ఏమిటిదేమిటి? నాబంగారుబాబు కిందపడి పోయేడేమిటి? అయ్యో తండ్రీ ఏమైంది? (ఏడుపు) లే బాబూ లే! అయ్యో దేవుడా! నాకొడుక్కేమైంది? నా కొడుక్కేమైంది! ఏమేవ్ ప్రసన్నా! ఆయన్ని తొందరగా రమ్మనవే! పిల్చుకురావే! (ప్రసన్నమయివెళ్తుంది.) అయ్యో తండ్రీ! అయ్యో! నాకొడుక్కేమైందీ? (ఏడుస్తుంది)

నృత్యకాళి : దొడ్డమ్మా! అన్నయ్య నోరు ఎంత పాడుకంపు కొడ్తోందో చూడు!

గృహిణి : ఛీఛీ నిజమే! ఛీఛీ - అయ్యోరామా! నాశనం! సర్వనాశనం! నాబంగారు తండ్రికి ఎవరోగాని ఏవిషమో గిషమో పెట్టేసేరు అయ్యోతండ్రీ! నేనేమైపోను రా బాబూ! (ఏడుస్తోంది)

(ప్రసన్నతో గృహస్థు వస్తాడు)

గృహస్థు : ఏమైందీ? ఏమిటిది?

గృహిణి : చూడండీ! నాబంగారుబాబు నవకుమారు ఎలా పడిపోయాడో! రామచంద్రప్రభో తండ్రీ! నా కొడుక్కేమైందిరా తండ్రీ!

గృహస్థు : (చూసి - కోపంతో) నాశనం! సర్వనాశనం! రాధే కృష్ణ! రాధేకృష్ణ! భ్రష్టుడా! నీచుడా! కులానికి చిచ్చుపెట్టేవుకదరా!

గృహిణి : ముసిలి కాలంలో పిచ్చిపట్టిందా ఏం? నాబంగారు తండ్రిని తిడతారెందుకు?

గృహస్థు : (కోపంతో) హు బంగారుతండ్రి! అవునవును! బంగారుతండ్రి! వాణ్ణి కన్నవెంటనే వడ్లగింజ వేసి చంపెయ్యలేకపోయేవూ?

నవకుమార్ : హియర్! హియర్! హుర్రే-ర్రే!

గృహిణి : అయ్యో తండ్రీ! ఇదేమిట్రా! తలాతోకాలేకుండా అర్థంపర్థంలేకుండా వాగుతున్నాడేవిటీ? అయ్యోరామా! పిల్లాడికి ఏదెయ్యమో పిశాచో

పట్టినట్టుంది!

గృహస్థు : నీ బుర్రలో పిసరంతైనా బుద్ధన్నది ఉన్నాదా? కనిపించడం లేదూ? నువ్వేం మనిషివే! ఈ దౌర్భాగ్యుడు తాగుడుమైకంలో ఉన్నాడు!

నవకుమార్ : హియర్! హియర్!

గృహస్థు : (కోపంతో) నోర్మూయ్యిరా సిగ్గులేని గాడిదా! సిగ్గూ లజ్జా ఏకోశాన్ని లేకుండా ఉన్నావ్!

నవకుమార్ : డేమ్ సిగ్గూ లజ్జా! బ్రాండీ తే!

గృహస్థు : విన్నావా ఇప్పుడైనా?

గృహిణి : అయ్యొయ్యో! అభంశుభం తేలీని నాకొడుక్కి ఇవన్నీ ఎవరు నేర్పించారు!

గృహస్థు : ఇంకెవరు నేర్పిస్తారు! ఈ కలకత్తాయే పాపాల పట్టణం! కలిరాజధాని! ఇక్కడ ఏ మంచి మనిషికైనా ఉండడం భావ్యమా?

గృహిణి : అక్షరాలా నిజం చెప్పేరు! అయ్యో రామయ్యతండ్రీ ఈ పట్టణం ఇలాంటిదని ఎవరు ఎరుగుదురు?

గృహస్థు : మీఅందరినీ రేపొద్దున్నే శ్రీబృందావన్ తీసుకుపోతాను. ఈ పనికిమాలిన వాణ్ణి ఇక్కడ ఉంచి లాభంలేదు- పద -మనం కిందకి వెళ్దాం -ఈకోతి వెధవని కాస్త నిద్రపోనియ్యండి!

నవకుమార్ : హియర్! హియర్! ఆఈ సెకండ్ ది రిజోల్యూశన్!

గృహస్థు : అయ్యొయ్యో! నావంశంలో ఈ కులభ్రష్టుడు పుట్టేడు ఏంఖర్మో!

గృహిణి : ప్రసన్నా! కమలా! కోడలుపిల్లా! మీరు కాస్సేపు ఇక్కడే ఉండి ఆ తర్వాత రండి!

(గృహస్థు, గృహిణి వెళ్తారు)

హరకామిని : (ముందుకువచ్చి) అమ్మడూ! చూస్తున్నావా! మీ అన్నయ్య స్థితి! అయ్యో! ఈ కలకత్తాలో నాలాంటి దౌర్భాగ్యపు ఆడవాళ్లు ఎంత మంది నాలాగే కష్టాలు పడుతున్నారో! లెక్కాపత్రం ఉన్నాదా? ఓరిదేవుడా! మాకెందుకు ఇలాంటి శిక్ష వేశావ్!

ప్రసన్నమయి : ఇది మొదటిసారిగా ఇవాళే చూశామా ఏం? జ్ఞానతరంగిణి సంస్థలో ఇలాంటి జ్ఞానమే కలుగుతుంది!

హరకామిని : నిజం చెప్పేవ్! ఈ రోజుల్లో కలకత్తాలో చదువుకున్నవాళ్లలో చాలామందికి ఇదిగో ఇలాంటి జ్ఞానం మాత్రమే కలుగుతోంది! నువ్వే చెప్పు - ఇలాంటి మొగుడు ఉంటే ఏం? లేకపోతేఏం? నీదగ్గర నాకు దాపరికం ఏంటి? ఇదంతా చూశాక ఉరిపోసుకు చావాలనిపిస్తోంది! (గట్టిగా నిట్టూరుస్తుంది) ఛీఛీ! (ఆలోచిస్తూ) సిగ్గులేకుండా ఇంకా పైగాపెచ్చు మనం దొరల్లా

సభ్యతకలవాళ్లం అయ్యేం అంటారు! నా అదృష్టమే తగలడిపోయింది! తాగి తందనాలాడుతూ దుమ్ములు చీకుతూ చెడువర్తనతో ఎవరైనా ఎక్కడన్నా సభ్యతకలవాళ్లు అవుతారా? ఇదేనా నాగరికత?

(తెరపడుతుంది)

(సమాప్తం)

